# తృ ణ పూ లి

( నవల )



: రచయిత :

ఆవాల దామోదరరెడ్డి (కమల శ్రీ)



ప్రచురణ :

విశ్వసాహితి - వరంగల్ విభాగం,

వరంగల్. [ఆం. ప్ర.]

# TRUNAPOOLI

Telugu Novel

By Avala Damodara Reddy

# తృణపూలి

తెలుగు నవల,

(కమలశ్రీ)

---


ప్రథమ ముద్రణ : జూలై 1989

ముఖ చిత్రము : శ్రీ మెతుకు రవీందర్ డ్రాయింగ్ టీచర్ Z.P.S.S. మడికొండ.





ప్రతులకు : 1. విశ్వసాహితి న్యూ బోయిగూడ, ఇం. నెం. 6-3-195 సికింద్రాబాదు-4. [పోతుకూచి ఏజన్సీస్]

2. విశ్వసాహితి-వరంగల్ విభాగం, ఇ.నెం. 25-11-140/1 బాపూజీనగర్ పోస్టాఫీసు, ఖాజీపేట.





వెల : రు. 12/- పన్నెండు.

బ్లాకు : శ్రీ లక్ష్మి బ్లాక్ మేకర్స్ - హన్మకొండ.

ముద్రణ : మాధవ ముద్రణాలయము, వరంగల్.

ప్రచురణ : విశ్వసాహితి - వరంగల్ విభాగం

ప్రతులు : 1000 ప్రతులు

# తృణపూలికి నా పూలు

శ్రీ అవాల దామోదరరెడ్డి వ్రాసిన 'తృణపూలి' నవల కొత్త పంథాలో నడిచింది. ఈ నవలలో రచయిత కాజీపేట, విజయపురి ప్రాంతాలు వర్ణించి వాస్తవికత ప్రదర్శించారు. కథా రచనతో పాటు రచయిత సంప్రదాయాలకు, ప్రాంతీయ సంస్కృతికి కూడా ప్రాధాన్యత యిచ్చారు. భాషా శైలి సులభతరమై అందరికి అవగాహన కలుగు విధముగా వుంది. మధ్యలో తెలంగాణ పదజాలం సహజంగా దొర్లింది. నవల మధ్య పాటలు, లేఖలు కూడా ఈ నవలకు కొత్త శోభ తీసుకొచ్చాయి.

ఈ నవల అధునిక, ప్రాచీన నాగరికతలకు అలవాలమై కొత్త రీతిలో వ్రాయబడింది. కథలో కొంత అస్పష్టత కనిపించినా రచయిత లక్ష్యాలు నిర్దిష్టంగా వున్నాయి.

నేటి కాలంలో నవలా రచన ఒక వ్యాపారమై పోయింది. నవల వ్రాయడం చాలా సులువని అందరి భావం. కాని జీవితం సమగ్ర స్వరూపం ఒక భాగమైనా నిర్దిష్టంగా చెప్పగలిగితే అది నవలగా ఉత్తమ మైనదిగా రాణించగలదు. ఈ దృక్పథం అవాల దామోదర రెడ్డి బాగా పాటించారు.

"తృణపూలి" పేరే విచిత్రంగా వుంది. వైచిత్రి కొంత నవలలో కూడా కనిపిస్తుంది. ఆ విధంగా దామోదరరెడ్డి (కమలశ్రీ) నవలా రంగంలో ఓ కొత్త పరిమళాల కుసుమాన్ని సృష్టించారంటే అతిశయోక్తి కాదు.

సికిందాబాదు
25-5-1989

హోతుకూచి సాంబశివరావు

# ఆ కాం క్ష

దాదాపు మూడు దశాబ్దులుగా సాహిత్యంలో అధికంగా ప్రచార ప్రాభవాలుపొందు తున్న నవలా ప్రక్రియ దాదాపు జనరంజకమై పాఠకులను అలరిస్తున్నది. కథా రచన చేసే ప్రతి రచయితా నవలపట్ల ఆ కృష్ఠుడయి నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేయడంలో యథా శక్తిగా కృషి చేస్తున్నాడు. ఇది సంతోషించ తగ్గ విషయం.

ఒక్క రచయిత రాసిన పది కథల్లో కంటె, పది మంది రాసిన పది కథల్లో జీవితం ఎక్కువ ప్రతిబింబిస్తుందంటారు కొడవటి గంటి కుటుంబరావుగారు. జీవితంలో విస్తృతిని ప్రతిబింబించే రచనలు చూడాలను కొన్నప్పుడు కొత్త రచయితల కోసమే చూస్తావని కూడా అంటారాయన.

కొత్త రచన లన్నిటిలోనూ గాఢతా, నిర్దుష్టతా లేక పోవచ్చు. కాని వైవిధ్య ముంటుంది. ఇది కూడా అవసరమే. రచనానుభవం పెరిగిన కొద్దీ రచనకు రాణింపు వస్తుంది. కాబట్టి ప్రతి కొత్త రచననూ ఆహ్వానించవలసిందే.

"తృణపూలి'' రచనలో భారతీయ జన జీవన రీతి పట్ల రచయితకు వున్న ఆసక్తి స్పష్టమవుతుంది. హృదయాలలో ఆర్ద్రత కనిపిస్తుంది.

భాషా శైలి విషయంలోను, కథా కథన విషయంలోను, సంభాషణా నిర్వహణ విషయంలోను రచయిత ఆరితేరి ఇంకా ఉత్తమ రచనలు అందిస్తారని నా ఆకాంక్ష.

— పోరంకి దక్షిణామూర్తి

# ముందు మాట

తెలుగమ్మ, చిట్టి తల్లి అన్నపూర్ణ వలె ఈ నవలలో రత్తమ్మ బొమ్మను కొని యిమ్మని బావను కోరింది. "తృణపూలి" అన్నపూర్ణకే యిష్టం!

నా విద్యార్థి దశ నుండి సాహిత్యము నన్ను చిరునవ్వుతో ఆహ్వానిస్తున్నది. దాని అందచందాల సుభాషితపు నేస్తాల మెళకువలను ఆకళింపు చేసుకొని, అలాంటి వాక్య మత్కార రచనలనే యితరులకందించాలని తహతహలాడినాను. ప్రథమంగా The Wreck మరియు శ్రీ కాంత్ నవలలు నాకు త్రోవచూపినవి. వాటిలోని పాత్రలు, సంభాషణలు నాకాధారములు. తెలుగులో విశ్వనాథవారి చెలియలికట్ట, వేయి పడగలు, చలంగారి మైదానం నా అభిరుచికి సామాజిక విలువలను ప్రతిబింబింపజేయు సాధనాలుగా నాలో నవలా స్వరూపాన్ని తీర్చి దిద్దినవి. అయితే కళాశాల దశలో రెడ్డిగారబ్బాయి అను నవలను శాస్త్రీయ ప్రగతి పరిణామ విలువల ప్రాధాన్యంగల దానిని రచించాను. అది యిపుడు ఇంట్లో లభించుటలేదు. శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'మరమనిషి' నవల అలాంటిలోటును సమాజానికందిస్తూనే వున్నది. శ్రీపోరంకి దక్షిణామూర్తిగారి మాండలిక భాషలోని నవలా రచనా విధానము మరొక మలుపుగా భావిస్తున్నాను.

అదొక విచిత్రమైన సంఘటన, మనిషి స్వరూపము, భక్తితత్త్వములు, భగవంతుని పై చింతన సృష్టి-శాస్త్రీయ గమ్యము. యిలాంటి విషయ శోధనలతో మనసులో నవల వ్రాయు తలంపు-ప్లాటు-కు అంకురార్పణ జరిగింది. భక్తి భావంతో తిరుమల వెంకన్నను స్మరించి నవల సాగాలని వారికే అంకితమిస్తానని వేడుకొన్నాను.

మా చెలకలో 1945లో మిలటరీవారి గుడారం వుండేది. ఒకసారి ఒక ఆంగ్లేయుడు చిరిగి పోయిన తన Hatను దగ్గరలోగల "తృణపూలి" పై ఉంచి సంతోషించగా నా చిన్నతనంలో చూశాను.

రైతు బిడ్డగా పొలములలో చూచు గడ్డితో చేసిన మనిషి బొమ్మ (తృణపూలి) నా నవలకు చక్కని నామధేయమై పోయింది. అవి తెలంగాణ ఉద్యమ రోజులు 1969 సంవత్సరము. పొలము బావి నుండి ఖాజీపేట-హైదరాబాదు రోడ్డు మీదకు వెళ్ళాలని ప్రయత్నించాను. మిలటరీ దళాలు తుపాకి ఎక్కుపెట్టి చూస్తున్నవి. వారి వెంట మడికొండ పోలీసు వున్నాడు. నన్ను ఏర్పాటుచేసి వారితో చెప్పాడు. 'నేనా గ్రామం మోతబరు రైతు బిడ్డ' నని. ఆ ప్రక్కనే వున్న తృణపూలిపైఆంగ్లటోపిని గురిచూస్తు ఒక మిలటరి వాడు అనగావిన్నాను "ఉస్కే పీచే కోహిహోంగా॥ మారూ క్యా?" అందుకే ప్రపంచాన్ని శాసిస్తున్న తిరుమల వెంకన్న శిలగా మారినట్లు తెలుగుధర్మము, తెలుగుజాతి ప్రపంచానికి సాహితీ ధాన్యాన్ని పంచిపెట్టి గడ్డి బొమ్మగా "తృణపూలి"గా మారి పోయింది.

ఒకసారి గోరా చదివాను. శ్రీ నవీన్‌గారి అంపశయ్యలోని ఆవాస క్షోభం ఈనాడు విద్యా పీఠాలు తెలుసు కొన లేక పోవుచున్నవి. అలాగే గోరాలోని పాత్రల ప్రేమ భిక్ష, అంపశయ్యలోని స్నేహ దీక్ష, తృణపూలిలోని సౌభాతృత్వము అంతర్జాతీయంగా తెలుగు క్షేత్ర సాహితీ పంట రుచికరమై తెలుగుధర్మము సజీవంగా నిలువాలని ఆశిస్తున్నాను. పరిజల మనిషిలోని ప్రామాణికత గోదాన్‌లోని జాతీయత నా నవలకు రెండు కళ్ళలాంటివి.

రష్యా నోబుల్ బహుమతి గ్రహీత ప్రముఖ రచయిత బోరిస్ పాస్టర్‌నాక్ డాక్టర్ జివాగో జీవితాన్ని తెలిపినట్లు తృణపూలిలో ఒక పారిశ్రామిక వేత్త నేడు తెలుగుజాతి కళను అంతర్జాతీయ వాణిజ్య రంగమున నిల్పి కీర్తి కిరీటాన్ని అలంకరిస్తాడు. ఈ నవలలో ప్రపంచ విఖ్యాత ధ్వన్యనుకరణ సమ్రాట్ శ్రీ నేరేళ్ళ వేణుమాధవ్ గారి కార్యక్రమము ఒక పాఠశాలలో జరిగినట్లు చిత్రించాను. దాన్ని తిలకించాలని ఆరోజుల్లో గ్రామాల నుండి వచ్చే వారు. ఈ నవల గురించి విని వేణు మాధవ్ గారు నన్నభినందించి నందుకు వారికి నాకృత జ్ఞతలు తెలియజేసు కొంటున్నాను.

రచయిత ఎర్నెస్ట్ హెమింగ్వే 1954 నోబుల్ బహుమతి పొందినాడు, "మనిషి యనిన వాడు ఓటమికి తయారు చేయబడలేదు. మనిషిని నాశనం చేయవచ్చు. కాని అతడు ఓడించబడడు." ఇది అతని నవల The old man and the sea లోని సత్యం అయితే మనిషి యొక్క నిజ స్వరూపం ( Portrait ) తృణపూలిలో దర్శింపజేయాలని చిత్రించిన నా నవల సార్థకమై సాహితీ రంగంలో రాణించాలని కాంక్షించుచున్నాను. నేను చదివిన R. K. Narayan, ముల్కరాజ్ ఆనంద్ పెట్రోడ్యుమిట్రో, Mary webb రచయితల భాషా శైలి కన్న, తెలుగు వారి సమాసాల ధోరణి కొంత పుణికి పుచ్చుకొని నవలా రచన సాగినదని భావిస్తున్నాను. ఇదొక తీరైన క్రొత్త నడక. గ్రామ్యము గ్రాంధికము, జాతీయ అంతర్జాతీయ, రచనల మేళవించుకొన్న క్రొత్త తరహా రచనా స్వరూపమే " తృణపూలి "

1950లో పోలెండ్ రచయిత H. E. కివిడి సాహిత్య నోబుల్ బహుమానము పొంది యున్నాడు. " నవల వలన దుష్పరిణామాలు కలుగకూడదు. నవల జీవితాన్ని బల పరచాలి అన్నాడు. కొన్ని తెలుగు నవలలు చదివి కొంత మంది పిచ్చివారైనా రని పత్రికలలో చదివినాను. " వారు గడియారము ముల్లును వెనుకకు త్రిప్పినట్లు రచనలు చేస్తున్నారు. " అని డా॥ సి. నారె అన్నారు. అలాంటి నవలలతోనూ, రచయితల గురించియు విషయము అప్రస్తుతము. మారుచున్న విలువలను తెలుప గలదీ మరపురాని తెలుగు వాని తృణపూలి నవలా గాథ.

విశ్వ సాహితీ ద్వారా అనన్యమైన కృషి చేస్తున్న " సాహితీ భీష్మ " శ్రీ పోతు కూచి వారి " అరుణ కిరణాలు "నవల రష్యా భాషలోకి అనువదించబడినది. హర్షనీయము.

వరంగల్లు శాఖ అధ్యక్షునిగా జిల్లా రచయితల మహా సభలు నిర్వహించాను. డా॥ జె. బాపు రెడ్డి గారు బాంకాక్‌లో అంతర్జాతీయ ఖ్యాతి ప్రతీకగా డాక్టరేట్ పొందారు. వారి సాహితీ మార్గం ఆదర్శ ప్రాయమైనది. కోరగానే వారు " తృణపూలిని " ఆవిష్కరించి నందుకు వారికి నా కృతజ్ఞతలు.

లిఖిత ప్రతిని తయారు చేసిన చి॥ యస్. రాజేంద్రప్రసాద్ యం,ఎ. కు నా ఆశీస్సులు. ముద్రణకు ఆర్థిక సహాయమందించిన పెద్దలకు మిత్రులకు వందనాలు.

భారతీయతను భక్తి భావా న్ని కళా సేవ ద్వారా పంచి పెడుతున్న కళాభిమాని మాధవ ముద్రణాలయము వరంగల్ యజమాని శ్రీ ఈగ శ్రీహరిగారు వారి సిబ్బంది " తృణపూలిని " సకాలంలో అందించి నందుకు కృతజ్ఞత తెలుపుచున్నాము. కవర్ చిత్రము గీసిన శ్రీ మొతుకు రవీందర్ మిత్రునికి నా స్నేహాంజలి.

తృణపూలి గురించి విశ్లేషించిన పెద్దలు శ్రీ పోరంకి, పోతుకూచి గార్లకు నాసాహితీ నమస్సులు. విశ్వ సాహితీ కార్యకర్తలకు కార్యదర్శికి ప్రత్యేక శుభాభివందనములు.

మీ

విధేయుడు

ఆవాల దామోదరరెడ్డి

( కమలశ్రీ )

జూన్ 1989

ఖాజీపేట, వరంగల్.

# తప్పొప్పుల పట్టిక

| పుట | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 4 | ర్వ | ర్తి |
| 4 | 28 | థ | ద |
| 19 | 1 | క | అ |
| 21 | 20 | ష్ | క్ |
| 24 | 5 | నగర | పురి |
| 38 | 17 | యుడ | యుండ |
| 55 | 25 | అని | అది |
| | | మడి | నుడి |
| | | పదెము | సదెమూ. |
| 39 | 1 | ఒ | ఎ |
| 40 | 6 | ల | లా |
| 43 | 13 | న | మ |
| 45 | 23 | రు | గు |
| | 28 | శ | వ |
| 47 | 8 | అత | అంత |
| 48 | 8 | వి | కి |
| 53 | 19 | గ | క |
| 57 | 23 | శ | శ్రి |
| 63 | 11 | స్త్ర | త్ర |
| 63 | 25 | నా | నాం |
| 71 | 14 | పా | పావ |
| 74 | 6 | ద్ | ద |
| | 25 | చి | చు |
| 76 | 23 | వ | మ |
| 82 | 27 | ద్య | శ్య |

ఒకడు అటునిటు కట్టెను చేతిలో త్రిప్పుచు ద్వారముల ముందు టక, టక మని శబ్దము చేయుచు వెడలి పోవుచుండెను. అతను ఎర్రిగా వుండెను.

భీమన్నకా విషయము మఱునాడు తెలిసి వచ్చినది. అతను ఘూర్కా వ్యక్తియని.

అషూరు వెంకటపురం అని ప్రసిద్ధి కెక్కియుండెను. అధునాతనంగా పైరుల అధిక దిగుబడి ఉత్సాహముతో మురిసినట్లుండెను. రైతులు క్రొత్తదనము నాహ్వానించు చుండిరి. అపటి జమీందారు భోగిరెడ్డికి భీమన్న గుమస్తా.

అలసి పోయిన పల్లె లక్ష్మివి లోకబాంధవుడు ఎంతో ఆప్యాయంగా నిద్రబుచ్చి నట్లు నుండెను. చూస్తు చూస్తు మాయమయ్యాడు. బుజ్జగింపు సరిపోయిందన్న కుతూహలము ఆతనిలో దాగి యుండెను.

పల్లెలోను, పట్నంలోనూ ఒకే ఊపిరి యుంది. కాని రూపంలోనే భేదం. అంతే. ఆరాటము, అధికారము వేరువేరు గానే ప్రశస్తి జెందియున్నది.

తెలుగునాడు విభిన్న కళలకు నిలయమైనది. వరంగల్లులో నేరేళ్ళ వంశంవారిపిత రులు పెద్దగా రాణించి యుండిరి. రాష్ట్రీయ సంప్రదాయములకు గొప్పదనము గూర్చిరి. వారి వంశమువాడే ధ్వన్యనుకరణ నుద్ధరించిన వేణుమాధవ్‌ను మరవరు. శ్రీ వేణుమాధవ్ ఆ రోజు ఒక పాఠశాలలలో ధ్వన్యను కరణజేసెను.

వెంకటపురం చుట్టు ప్రక్కల్లో చాలాకాలము దోపిడీలు దొంగతనాలు మితి మీరి పోయినవి. ఘూర్కావ్యక్తి భీమన్నకు కనబడినపుడు అతని కళ్ళలో ధైర్యం నిలిచిపోయింది. ఘూర్కావారు నేపాలు ప్రాంతము నుండి యితర రాష్ట్రములకు వెళ్ళి మారు మూల ప్రాంత

ములలో తెల్లవార్లు కాపలాకాయుచు జీవించెడివారు. నెల నెలకు యింటింటికి కొంత అడుగు కొని బ్రతుకు చుండెడివారు. మన దేశములో వీరు కొంత మంది డార్జిలింగ్ ప్రాంతములో స్థిర పడియున్నారు. ధ్వన్యనుకరణ వినాలని పల్లెల నుండి ఎంతో మంది వచ్చిరి ఆ రోజు. రాత్రి పది గంటలు దాటి పోయింది. అలస్యంగా యింటి ముఖము పట్టాడు భీమన్న ఆ రోజు భయంమితి మీరి పోయింది. నెలకో రెండు తడవలు వరంగల్లుకు వెళ్ళి సామాను కొనుక్కొని రావడము అతని కలవాటు. కాజీపేట నుండి కాలినడకన యింటికి వచ్చుచుం డెను. అచటనే ఎనిమిది గంటలయింది. భయం భయంగా నడిచి వెళ్ళేసరికి గ్రామములో ఘోర్కా వ్యక్తి గస్తీ తిరుగుచుండెను. అతను యింటి దాపురాగానే ఘోర్కా వ్యక్తి తీక్షణముగా జూచెను.

"ఇంత దేర్ (సేపు) ఎక్కడికి వెళ్ళావు?" అన్నాడు ఘోర్కా.

"పేటకు వెళ్ళి వస్తున్నాను" భీమన్న జవాబిచ్చెను.

భీమన్న యింటిలోనికి వెళ్ళడం గమనించి గోర్ఖా తిరిగి గస్తీ తిరుగుటకు వెళ్ళి పోయాడు.

చిలుపూరు గ్రామములో దివ్యజ్ఞాన సమాజమును నడిపించుచున్న సుధీరరెడ్డి వరంగలు ప్రాంతములో పేరు మోసినవాడుండెను. రామకృష్ణ మఠముల సమావేశములలో పాల్గొనెడివాడు. గీతాతత్త్వము, వివేకానంద బోధను పదేశించుట ఆయన కర్తవ్యము. ఉపనిష త్సారమును బోధించుచుండెను అప్పుడప్పుడు వెంకటపురము వచ్చిప్రబోధము చేయుచుండెను.

ఆనాడు ఉదయముననే వెంకటపురం వచ్చి సుధీరరెడ్డి రాత్రి వరకుండెను. చాలా మందిని సన్నిహితుల జేసుకొనెను. భోగిరెడ్డి, సుధీరరెడ్డిని ఆదరించెను. వారి వెంట భీమన్న నడిచి వెళ్ళుచుండెను. తన పాకముందుగా పోవుచున్న భీమన్నకు భార్య నొప్పులు పడడం వినిపించింది. అప్పటి కప్పుడే భోగిరెడ్డితో చెప్పి వరంగలుకు భార్యను తీసుకొని వెళ్ళి పోయెను భీమన్న.

అతి కష్టము మీద శస్త్ర చికిత్స జేయగా పిండము బయటపడేలోపుగానే మృతి జెందియుండెను. భార్య బతుకమ్మ చావు బ్రతుకుల మధ్య నతమత మయినదన్న వార్తవిని భీమన్నను ఓదార్చిన వారే కరువైపోయిరి.

బతుకమ్మ మీద ఎన్నో అపోహలు లేవదీసిరి. 'మొగణ్ణి వచ్చుక ఎదో మందు తాగిందని' కొందరు, 'భోగందాని బ్రతుకు బ్రతికే వాళ్ళకేం అలాగే వుంటారని' కొందరు అనుకోవడం భోగిరెడ్డి చెవిన బడింది.

అప్పుడప్పుడు క్రైస్తవ మత పరిచారకులు వెంకటపురమునకు వచ్చుచుండిరి. చాల మంది హరిజనులను తమ మతములో కలుపుకొనగలమని మాట యిచ్చి యుండిరి. వీరు

ఉదారముగా అమెరికా నుండి ఎగుమతి చేయబడు గోధుమ ధాన్యమును పంచుచుండిరి. కాజీపేటలో వంద ఎకరముల మేరలో ఒక ఉన్నత పాఠశాల మరియు నొక వైద్యశాల యాజమాన్యము నీ సంస్థ నిర్వహించు చున్నది. వెంకటపురం చుట్టు పట్ల గ్రామాలలో అయిదారు క్రీస్తు ప్రార్థన మందిరములు ఆసంస్థ ద్వారా నిర్మింపబడినవి. భోగిరెడ్డి అనుమతి ప్రకారము వెంకటపురములో నొక క్రీస్తు ప్రార్థనా మందిరము నిర్మించవలయునని సంస్థ తలపెట్టెను. భోగరెడ్డి మత ప్రబోధమును ప్రశంసిచెను. ఆ సాంప్రదాయములలోని కొన్ని అంశముల మూలముగా భోగప్రియుడై పైకి మాత్రము మతగురువుల మెప్పుకై ఒప్పుకొన్నటుల నటించెను. వారు భోగిరెడ్డి లాంటివాడే తమ మతములో కలియు చున్నాడను ప్రచార సాధనము ద్వారా విర్రవీగు చుండిరి.

భోగిరెడ్డి మెల్లమెల్లగా కొంతమంది ఆంగ్లేయ యువతుల పరిచయము కల్గించుకొని షికారులకు వెళ్ళునెపమునను క్లబ్బులలోను ఆటలు సలుపుచుండెను. మతగురువులిట్టి విషయముపై శ్రద్ధ వహించకుండిరి. భీమన్నకీ విషయము లన్నియు మామూలుగా అర్థమైపోయినవి.

సుగుణరాశియైన బతుకమ్మ బ్రతుకు కొన్ని అపనిందలకు పాల్పడిన సంగతి భీమన్నకు తెలియకపోలేదు. అలాంటి మనోవ్యధతో బాధపడ నవసరము లేని దృఢ నిశ్చయ మనస్కుడై భీమన్న కాలమును గడుపు చుండెను. భోగిరెడ్డి డబ్బు దుబార ఖర్చు చేయుటచే వ్యవహారాల భారము భీమన్నపైబడెను ఒక హరిజనుడు ఎల్లయ్య క్రైస్తవ మత ప్రచారకునితో మేము ఈ మతంలో కలసినట్లు మా దేవుళ్ళ పూజించకుండా వుండలేమని అనుట సుధీర రెడ్డి వినెను. తనలో తానే నవ్వుకొనెను భీమన్న ఈ విషయములతో పనిలేక వ్యవహారము చక్కగా చేయుచుండెను.

# 2

అది విజయపురి ప్రాంతము. నాగార్జున సాగర ప్రాజెక్టు పరిసరములలో గల చిన్ని గ్రామము. దానినే విజయపురమని పిలుచుచుండిరి. కృష్ణానది కాల్వల నీటి వనరుల ద్వారా పెక్కు నూతనోపాయములు జేత బంజరు భూముల నచట సాగుచేయుచుండిరి. నందికొండ నుండి అచటికి కంకర రోడ్డును ప్రభుత్వమువారు వేయించిరి. దుర్గమమైన యా అడవి ప్రాంతము నంతయు బయలు జేసిరి.

ఆ ప్రాంతము పది సంవత్సరములలోనే ఎంతో పెరిగి పోయినది. ఎంతో మంది అచట స్థిరపడి పోయిరి. ఇప్పుడచట ఇతర సౌకర్యములు కూడ కల్పింపబడినవి. ఒక తపాల కచేరి నెల కొల్పబడినది. వైద్యులు కొంతమంది యచటనే యుండి ప్రజాసేవ చేయ సంకల్పించుచుండిరి.

పలు ప్రాంతముల నుండి కూలీలచటకి వచ్చి బ్రతుక గలుగుచుండిరి. ప్రభుత మా విషయమును గ్రహించెను. కార్మిక శాఖ విభాగము ద్వారా కూలీల కెవలేనిసేవ చేం వలయునని ప్రభుత్వము సంకల్పించెను.

అనాగరికత పై విజయము సాధించినట్టి ఆ ప్ర దేశము నూతనోత్సాహము పురోగమించు చున్నటుల నుండెను.

ఒకనాటి మిట్ట మధ్యాహ్నము వేళ ఒక సామాన్యుడు ధోవతిని కాశె పోసు కొ తిరుగుచుండగా కిరణ్ చూచెను. తెలుగు సంప్రదాయ లక్షణములను విదానించి గమనించెవ చక్కని ధోవతి ధరించిన తెలుగు వేశమును, లుంగీల, అడ్డ బట్టల మధ్య సంప్రదాయమ తమిళుల, అరవల నడపడికి అలవాటుపడ్డ ఆంధ్ర సంప్రదాయమునకు కొంత భేదము కల్పి చుటకు కారణము చరిత్రయనియే చెప్పవచ్చును. మహేంద్రోదయమే పలుకరించినట్లయ్యెన

వేసవి మే నెల రోజులారంభమైనవి. కిరణ్ పొలమునకు వెళ్ళెను. గ్రామమ నిర్మానుష్యముగా యుండెను. ప్రొద్దస్తమానము అతను పని చేయుచు కన్పించుచుండగా ఏద వింత అనుభూతి కలగుచుండెను.

ప్రకృతిలో తేమ లేమికి శిరముపై స్వేద బిందువులు తపన దృశ్య ప్రదర్శనమ కావించుచున్న వేడి భరింప రానిదిగా వుండెను.

కాలము, పనిని కోరినట్లుగా భవిష్యత్తులో ఎప్పటికిని విశ్రాంతి జెంది యుండ వట్లుండెను.

గృహము నుండి కిరణ్ ఎంతకాలము వెళ్ళినను ఏదోపనిఅతనిని వేధించుచుండెను

ప్రారంభింపబడిన సమయమున పరిస్థితులు కష్ట సాధ్యములై మొదలిడినను జీవి మున యెన్నడు విచారించి యుండలేదు, అతను జీవిత పథమునె కాంక్షించుచుండెను.

పొలము ను పరికించుటకు ముందుగానే త్వరగా వెళ్ళి పోవుట అతని సహజమై పంథ.

ఐదేళ్ళ క్రితము కాశీ యాత్ర చేసి యుండెను. అందు మూలమున యిప్పుడతని హాయి గూర్చుచుండెను.

కిరణ్ జీవితము స్థిరపడుచుండెను.

"త్వరగా రమ్ము!" గోధ అన్నది.

సంతోషపు సమయ ప్రసన్న శుభోదయమాయెను. రవి ప్రకాశించుచు కన్పించెను. కిరణ్ ఆశ్చర్యచకితుడయ్యెను. ఆరోజు చాల ఆలస్యమైనది.

కిరణ్ ఇతర సాంస్కృతిక కార్యకలాపములకు అలవాటు పడినట్లు తెలియదు. స్వయం అంతరాత్మ ప్రబోధమనదగు అంతరాదేశ నిశ్చయమే ఆతనికేదో సిరిని ప్రసాదించి యుండవచ్చును.

పదియేళ్ల క్రితము తన అభిప్రాయములను యితరులకు తెలియపరచ లేని స్థితిలో యుండి యుండెను.

భూపేశ్ విజయపురములో పేరు మోసిన ధనికుడు. కిరణ్ అతని తనయుడు. తన యిచ్ఛతో చదువుకొనుటకు చాలాకాలము విజయపురము నుండి శ్రీ శైలము వెడలెను. అచట మరో జీవితము కన్పించెను.

పొలములన్నియు భూపేశ్ పర్యవేక్షించుచుండెను. కిరణ్ ఎన్నడును వ్యవసాయం చేయ మొదలు పెట్టలేదు. వెంట తీసుకొనిపోయిన అసామాన్యుని జీతముంచుకొనుటకు నిశ్చయించుకొనెను.

ఒకనాడు భూపేశ్ అతనిని యింటిలో ఒంటరిగా ఉండుట గమనించెను. క్రొత్త మనిషియగు ఆనంద్ గురించి తెలుసు కొని జీతముంచు కొనుటకు ఒప్పుకొనెను. భూపేశ్ నకు గూడా అతని మీద జాలి కలిగినట్లుండెను.

"కిరణ్!" భూపేశ్ బయటికి పిలిచెను

"నాయనా!" ఆతను అరచిచెప్పెను, "నేను యిప్పుడు త్వరపడి వెళ్ళుచున్నాను. చీకాకు పడకుము"

అ వృద్ధ భూపేశ్ నవ్వెను. "ప్రియతనయా! క్షణికము కరుణ ప్రకాశ నిలయము మరియు నిమిషము ప్రగతిజెందని అసహ్యము"

కిరణ్ విచారించెను. అతడు దానిని మనసులో తనఊహలతో తల పోయుచు వెడలి పోయెను.

భూపేశ్‌నకు పొలములు ప్రత్యేక పరిధులలో యుండియుండెను. ఇతర వ్యక్తులను అందులో పని చేయించెడివాడు. మరియు అతను కూలీలను కూడా ప్రోత్సహించి అవసరమైనపుడు ప్రత్యేక కార్యముల చేపట్టెడివాడు. అతను కమ్మదొర.

కూలీలు ఎప్పుడును పదపడి పనిచేయు అలవాటు లేని వారగుటచే భూపేశ్ అసహ్యించు కొనుచుండెను.

చాలాకాలము కిరణ్ విద్యావిషయమే ఒక ప్రత్యేక సమస్య అయియుండెను.

కిరణ్ కు కృషి పైన యిష్టముండుటచే అతని గౌరవమర్యాదలకు కూలీలు పాటు పడుచుండెడివారు.

కృషి కష్టతరమయి పోయెను. ఆరోజులు మరింత కష్టతరమై పోయినవి.

ఆ రోజు ఆనంద్ తీరికగా నిద్రించెను. పలువేషములతో బొమ్మలమ్ము వాడు వీధిన తిరుగు చుండినట్లు ఆనంద్‌ను బొమ్మ కొనిమ్మని మరదలు రత్నమ్మ మారాంవేసినట్లు వెంటనే అతడు మాయమై శ్రీ తిరుపతివేంకటేశ్వరుడు అభయహస్తముతో దర్శనమిచ్చినట్లు కలగాంచెను. స్వామికి నమస్కరిస్తు ఆనంద్ దిగ్గునలేచెను.

# 3

పూర్వపు రైతులు మామూలు కాపులని, కమ్మలని పిలువబడుచుండిరి. భూకామందులు, యజమానులు దొరలనికీర్తింపబడిరి. ఎప్పుడో వారు ప్రజలపై దయాదాక్షిణ్యములు మానిరి. భూపేశ్‌కు మొదటి నాగరికత లేని స్థితి అసహ్యకరముగా నుండెను.

ఒకనాడు రమేశ్ తనభవనములో ఏకాంతముగా యుండెను. అతనుకూలీలపై దయ గలవాడు.

రమేశ్ ఒంటరిగా యుండుటకు అలవాటు పడినవాడు. ఎవరికి సరిగా తెలియనివాడు.

కూలిపని స్థిరపడలేదు, మరియు కొన్ని గుంపులు గుంపులు గల కార్మికులువృత్తి వలె జీతము కాకుండ నిర్వర్తించగా ప్రాముఖ్యత హెచ్చెను.

ప్రాథమిక విద్య ప్రత్యేకముగా బోధింపబడుటకు ప్రభుత్వము యత్నించుచుండెను.

దేశము నలుమూలలందు కూలిపని బాధలు వినవచ్చుచుండెను. జనత యిట్టి కూలిపని యందు స్వేచ్ఛయుండుటకై పోరాటముసాగించినది.

రమేశ్ మరియు భూపేశ్ సన్నిహితులు, మరియు పొరుగు వారు.

వారి వృద్ధదశ కన్నాముందు పూర్వీకులు ప్రజల పై చేసిన పాలన క్రూరముగా యుండెను.

రమేశ్ నకు సికతని యను ప్రియమైన కూతురుండెను. కిశోర్, సికతని యొక్క సోదరుడు.

కిరణ్ కు కృషి పైన యిష్టముండుటచే అతని గౌరవమర్యాదలకు కూలీలు పాటు పడుచుండెడివారు.

కృషి కష్టతరమయి పోయెను. ఆరోజులు మరింత కష్టతరమై పోయినవి.

ఆ రోజు ఆనంద్ తీరికగా నిద్రించెను. పలువేషములతో బొమ్మలమ్ము వాడు వీధిన తిరుగు చుండినట్లు ఆనంద్ ను బొమ్మ కొనిమ్మని మరదలు రత్తమ్మ మారాంవేసినట్లు వెంటనే అతడు మాయమై శ్రీ తిరుపతివేంకటేశ్వరుడు అభయహస్తముతో దర్శనమిచ్చినట్లు కలగాంచెను. స్వామికి నమస్కరిస్తు ఆనంద్ దిగ్గునలేచెను.

# 3

పూర్వపు రైతులు మామూలు కాపులని, కమ్మలని పిలువబడుచుండిరి. భూకామందులు, యజమానులు దొరలనికీర్తింపబడిరి. ఎప్పుడో వారు ప్రజలపై దయాదాక్షిణ్యములు మానిరి. భూపేశ్ కు మొదటి నాగరికత లేని స్థితి అసహ్యకరముగా నుండెను.

ఒకనాడు రమేశ్ తనభవనములో ఏకాంతముగా యుండెను. అతనుకూలీలపై దయ గలవాడు.

రమేశ్ ఒంటరిగా యుండుటకు అలవాటు పడినవాడు. ఎవరికి సరిగా తెలియనివాడు.

కూలిపని స్థిరపడలేదు, మరియు కొన్ని గుంపులు గుంపులు గల కార్మికులువృత్తి వలె జీతము కాకుండ నిర్వర్తించగా ప్రాముఖ్యత హెచ్చెను.

ప్రాథమిక విద్య ప్రత్యేకముగా బోధింపబడుటకు ప్రభుత్వము యత్నించుచుండెను.

దేశము నలుమూలలందు కూలిపని బాధలు వినవచ్చుచుండెను. జనత యిట్టి కూలిపని యందు స్వేచ్ఛయుండుటకై పోరాటముసాగించినది.

రమేశ్ మరియు భూపేశ్ సన్నిహితులు, మరియు పొరుగు వారు.

వారి వృద్ధదశ కన్నాముందు పూర్వీకులు ప్రజల పై చేసిన పాలన క్రూరముగా యుండెను.

రమేశ్ నకు సికతని యను ప్రియమైన కూతురుండెను. కిశోర్, సికతని యొక్క సోదరుడు.

సరళ నిశిత దృష్టి గలిగిన స్త్రీ. ప్రతి విషయమును పరీక్షించుటయందు దక్షురాలు. వారి కూలీలు నిత్యపు పనివారందరును భవిష్యత్తు జీవితముపై ఉత్సాహమును చూపుచుండెడివారు.

కాలము గడచి పోయినది. వారి పనులందే మాత్రము దయలేకుండెను,

భూ యజమానులు అప్పుడప్పుడు మరింతయు అసహ్యతను తమ తమ ఆస్తులపై కనపర్చ చేయుచుండిరి.

సాధారణముగా వర్తమానమున భూత కాలమే పాటిదైనను, భవిష్యత్తును కాంక్షించు చున్నటుల నుండెను. ఇట్టి విషయం నాగరికతలోని నవ్యత వలనే యున్నట్లుల దోచెడిది.

రమేశ్ ఎల్లప్పుడు పని వారికి చెప్పు ధోరణి మారకుండెను. "నేను యెన్నడును సంతసించుటకు ఉత్పత్తి అసాధ్యమై పోవుచున్నది. జీవిత విధానము తృప్తికరముగా లేదు. ఇది యంతయు స్పష్టమై పోవుచున్నది." అని అనుచుండెను.

పని వారు అది వినగలుగుచుండిరి. "అతి వాస్తవముగా యిది అదృష్టము" అని వారు చెప్పుచుండిరి.

రమేశ్ చాల యుత్తముడుగా యుండెను.

రోజులు మేలు గూర్చునట్లొప్పగా వారి ఆనందమునకు మేరలేకుండెను. క్రమముగా జీవితము ఎదుర్కొను సమస్యలు తీరలేదాయనిపించు చున్నట్లులను తోచుచుండెను. క్రొత్త వస్తువు సాధించుదశకు వచ్చుచున్నటుల కార్యసాధనలు గడిచి పోయినవి గడచి పోవగా నూతనముగా మరొకటి తలెత్తుచున్నటుల యుండెను.

వారు జూదమాడుటపై యిష్టపడకుండిరి.

అకాలపు వానలవల్ల రైతులు బాధజెందిరి. ఎంత చెట్టుకంతగాలి యన్నట్లు ఎవరిబాధలు వారికే యుండి యుండెను.

గొల్లలు, తెలగలు, ఇంటి పనులను జేయుచుండిరి హరిజనులు, బోయవారు, పద్మశాలీలు, గౌండ్లవారు సమయాను కూలము కూలి పనికి వచ్చుచుండిరి. భృత్యవర్గమంతయు అన్ని రకముల తెగలకు జెందియుండెడిది. గొల్లలు గొర్రెల కాయుచుండిరి. పశువుల కాపరులును మామూలుగా గొల్లలే యుండి యుండిరి.

అను కూలతననుసరించి జీతములు చాల కాలము యుండెడివారు. వారికి వేసవిలో తీరికగా యున్నను చేయవలసిన పని తప్పకుండెడిది. వర్షాకాలములో నాట్లు మొదలగునవి

సరళ నిశిత దృష్టి గలిగిన స్త్రీ. ప్రతి విషయమును పరీక్షించుటయందు దక్షురాలు. వారి కూలీలు నిత్యవు పనివారందరును భవిష్యత్తు జీవితముపై ఉత్సాహమును చూపుచుండెడివారు.

కాలము గడచి పోయినది. వారి పనులలో మే మాత్రము దయలేకుండెను,

భూ యజమానులు అప్పుడప్పుడు మరింతయు అసహ్యతను తమ తమ ఆస్తులపై కన్పట్ట చేయుచుండిరి.

సాధారణముగా వర్తమానమున భూత కాలమే పాటిదైనను, భవిష్యత్తును కాంక్షించు చున్నటుల నుండెను. ఇట్టి విషయం నాగరి కతలోని నవ్యత వలెనే యున్నట్లుల దోచెడిది.

రమేశ్ ఎల్లప్పుడు పని వారికి చెప్పు ధోరణి మారకుండెను. “నేను యెన్నడును సంతపించుటకు ఉత్పత్తి అనూహ్యమై పోవుచున్నది. జీవిత విధానము తృప్తికరముగా లేదు. ఇది యంతయు స్పష్టమై పోవుచున్నది.'' అని అనుచుండెను.

పని వారు అది వినగలుగుచుండిరి. “అతి వాస్తవముగా యిది అదృష్టము” అని వారు చెప్పుచుండిరి.

రమేశ్ చాల యుత్తముడుగా యుండెను.

రోజులు మేలు గూర్చువట్లొప్పగా వారి ఆనందమునకు మేరలేకుండెను. క్రమముగా జీవితము ఎదుర్కొను సమస్యలు తీరలేదాయనిపించు చున్నట్లులను తోచుచుండెను. క్రొత్త వస్తువు పలించుటకు వచ్చుచున్నటుల కార్యసాధనలు గడిచి పోయినవి గడచి పోవగా నూత్నముగా మరొకటి తలెత్తుచున్నటుల యుండెను.

వారు జూదమాడుటపై యిష్టపడకుండిరి.

అకాలపు వానలవల్ల రైతులు బాధజెందిరి. ఎంత చెట్టుకంతగాలి యన్నట్లె ఎవరిబాధలు వారికే యుండి యుండెను.

గొల్లలు, తెలగలు, ఇంటి పనులను జేయుచుండిరి హరిజనులు, బోయవారు, పద్మ శాలీలు, గొండ్లవారు సమయాను కూలము కూలి పనికి వచ్చుచుండిరి. భృత్యవర్గమంతయు అన్ని రకముల తెగలకు జెందియుండెడిది. గొల్లలు గొర్రెల కాయుచుండిరి. పశువుల కాప రులును మామూలుగా గొల్లలే యుండి యుండిరి.

అను కూలతవమపరించి జీతములు చాల కాలము యుండెడివారు. వారికి వేసవిలో తీరికగా యున్నను చేయవలసిన పని తప్పకుండెడిది. వర్షాకాలములో నాట్లు మొదలగునవి

రమేశ్, సురేష్ నెరిగి ఆశ్చర్యపడెను, "ఓః సురేష్!" అని అరచెను.

చాల సేపటికి సురేష్ రమేశ్ దగ్గరకు వచ్చెను.

సురేష్ యువ్వనుడు. అందగాడు. విశాలమైన నుదురుగలవాడు. చూచుటకు గంభీరుడుగా కన్పించును.

సురేష్ తండ్రి ప్రేమదాస్ ధనికుడుగా విజయపురములో పేరుపొందియుండెను.

సురేష్ చాల కాలము విజయపురము విడిచి వెళ్ళి యుండెను. ఏకాకిగా చాలకాలము జీవించెను.

విజయపురములోని రాజకీయ ముఠా వాదములకు గురై మరణించిన ప్రేమదాస్ వున్నంతకాలము మంచి వ్యక్తిగా యుండి యుండెను. ప్రేమదాస్ మానసిక బాధయే మృత్యువునకు దారి తీసెను.

సురేష్‌ను చూచినపుడు రమేశ్ నయనములు అరుణపు రంగు తో నిండెను. వ్యక్తిత్వములోని విరంకుశత్వమును జూచి చింతించెడివాడు సురేష్.

ఆతనొక బొమ్మవలె రమేశ్‌కు తోచెను.

కిశోర్ వెను వెంటనే రావడము తటస్థించెను.

"అబ్బ! ఎంతకాలము కనబడకుండా వుంటివయ్యా రమేశ్! చిన్నాయనా!" అనిసురేష్ యనెను. వెను వెంటనే కిశోర్ వైపు తిరిగి, "ఓహో! కిశోర్! నీవు ఎట్లా జీవించుచున్నావు?" అని మందలించెను.

"ఊ(!" అని కిశోర్ సిగ్గుజెందెను.

అంతయు విశ్శబ్దము నావరించెను.

రెండు సంవత్సరముల యనంతరము సురేష్, విజయపురమునకు తిరిగి వచ్చెను. గత వేసవిలో కూడ విజయపురము రాలేక పోయెను. భాగ్యనగరములో మంచి నేస్తసౌభాగ్యము వల్ల సెలవులు గడచి పోయినవి.

బ్రతికి వున్నంతకాలము ఆతను శ్రమలతో బాధలతో జీవితమున సతమతమవుచుండెను.

అతను పిల్లవాడుగా వున్నప్పుడు ప్రేమదాస్ మరణించి యుండెను.

సురేష్‌నకు తల్లి అరుణ కూడ గుర్తుకు వచ్చెను. ఆతని బాల్యమునవనే ఒక రోగముతో బాధపడి సురేష్‌ను వదిలి పరలోకగతురాలయ్యెను. అప్పుడు సురేష్‌ను తల్లి వియోగము

నుండి లోటులేనిరీతి కాపాడినవాడు రమేశ్. అయినా బాల్య క్రీడలలో కిశోర్, సురేష్‌నకు తల్లి మరణ వార్త గురించి జ్ఞప్తికి తెచ్చుచుండెను. ఆస్ఫురణ సురేష్‌నందు అనిర్వచనీయ మైన ముద్రవై చుకొని యున్నది.

అప్పటి నుండి ఏకాంత వాతావరణములో పెరిగి పెద్ద వాడాయెను.
కొద్ది సేపటికి సరళ యింటి పనిని చూచు కొన్నపై బయటకు వచ్చెను.
ఆవిడ అతనిని చూచినంతనే సంతసించెను. చూచిన కొద్ది ఆనందము జెందసాగెను.

సురేష్‌లో వినయము పుట్టిపడుచుండెను. నాయకులతో ఖచ్చితమైన వాదములు చేసెడి వాడు. కావుననే ఉద్యోగ ప్రాప్తికి దూరుడయ్యెను. ఆ ఆలోచనలతో సతమతమవు చుండెను.

"ఏలాగున్నావు? సురేష్ ?" ఆవిడ ప్రశ్నించినది.
సురేష్ అతని నోటి నుండి ఏమియు చెప్పడేమోనని సరళ భావించెను.
"క్షేమముగానే వుంటున్నాను కదా! ఏం! అలా అడుగు తున్నావేం?"
సరళ మనసులో తీరని ఆవేదన పొందచూపెను.

అతను మౌనముగా యింటి బయటకు అడుగిడెను. అందరు సంతసముగా చూచు చుండిరి.

"సరళ పిన్నమ్మా! నేను వెళ్తున్నాను" చిట్ట చివరకు అతను చెప్పచునడవసాగెను.

అతని గురించి సరళకు చాలవిచారముగా యుండెను ఆవిడ గతించిన పరిస్థితుల బాధను పీల్చుకొన్న దానివలె భవిష్యత్తును ఊపిరి బిగపట్టి వదలగా, నిర్దయ భవిష్యత్తు యోచించ రానిపై పోయెను.

సురేష్ మెల్లగా ఇంటి నుండి జారుకొనెను.
ఇల్లంతయు నిశ్శబ్దముతోనిండి వుండెను.
రమేశ్ ఏకాంతముగా, ఒంటరిగా కుర్చీలో కూలబడి పొగ పీల్చుచుండెను.

వ్యవసాయ రంగమున నూతన్న ప్రయోగములు చేయబడుటచే గ్రామ సేవకుల వికాస మండలుల ప్రాతినిధ్యమే గ్రామీణ ప్రగతి మార్గమయ్యెను. దేశ దర్పణమున వాటి ప్రతి బింబముల ప్రదర్శించుటయేవారి ముఖ్య కర్తవ్యమై యుండెను.

సికతని యింటి తోటను కాంక్షించుచుండెను. ఆవిడ మామూలుగా అరటి, నిమ్మ,జామ చెట్లను పెంచెను. మల్లె మందారము, పారిజాతము, సత్యనారాయణ పుష్పపు మొక్కలు

పొద్దు తిరుగుడుపూ మొక్క, జాజిమొక్క, గోరంట, రుద్రాక్ష, గులాబి మొక్కలను పెంచుటకు మిక్కిలి ఉత్సాహము జెందెను.

కిశోర్ మనో ప్రవృత్తి సున్నితమైనది. చేమంతి, క్రోటన్ మొక్కలనిన అతనికి మిక్కిలి యిష్టము. నారింజ, మామిడి మొదలగు చెట్లను బావివద్ద పెంచుటకు యత్నించెను. జొన్న, మొక్కజొన్న, మిరప, పెసలు, కందులు, మినుములు, నువ్వులు, శనిగలు పండించుటకు యత్నించుచుండెను. ఎల్లిగడ్డ, ఉల్లిగడ్డ, మెంతులు, గోంగూర పొగాకు మొదలగునవి పండించుటకు పలుయత్నములు చేసెను. అన్ని విధములయిన ధాన్యముల నన్ని తీరులలో అన్ని రకముల వడ్ల పంటను పండించుటకై అతనెన్నియో పాట్లు పడుచుండెను.

మంచి ఉత్పత్తి పంటలు వారిని ధనికుల చేసినవి. వారు చొప్పవరకు యంత్రము నొక దానిని కొనిరి. ఇంటిలోపాడి సమృద్ధిగా యుండెను. కిశోర్ స్వయముగా గేదెం పాలు పితుకు చుండెను.

యాత్రలకు వెళ్ళి ఏకశిలానగరమును దర్శించి ప్రాచీన తెలుగుదనపు ఉన్నతస్థితిని జ్ఞప్తికి తెచ్చు శిలాఖండములను వారు దర్శించిరి. సికతనికి ఆ ఘటన మైమరపించినటుల నుండెను. శిల్పములలో తేజము ప్రకాశించుచుండెను. గురుదర్శన మనదగిన నేర్పు వ్యక్తి పడగా విద్య ప్రకాశించినటులతోచుచుండెను. ఆరోగ్యము నే తలపింపజేయునదిగా కళ ఒప్పు నట్లుండెను. కార్మికునికైనను, కూలికైనను గల ఈ పట్టుదలలాంటి సాధనలోని పరమార్థము సాధ్యమను అభిప్రాయము సికతనికి గల్గెను. నీటిలో మునగని రాచుప్ప యిటుకలగని వారు చకితులయ్యిరి.

నందిగొండలో యస్. యస్. యల్. సి. వరకు చదివిన సికతని యింక చదవలేక పోయెను. రమేశ్‌నకు చదివించవలయునని కుతూహలముగనున్నను, వరశ కయిష్టముగానున్నందునను సికతని యోగ్యత లేనిదయినందునను చదువు కుంటుబడిపోయినట్లుండెను.

వారి జీవితము సిరిసంపదలతో పెన వేసుకొనెను.

# 5

ఉదయాస్తమయముల పోరాటాన్ని తిలకించుచున్నవాడు సూర్యుడు. పశ్చిమ దిశలో జగతి పూర్వ భాగాన్ని లేపమిడకుచుండెను. కిరణ్ పొలములో తొందరపడి తిరిగెను. ఆపిదప యేదోజ్ఞప్తికి రాగానే యింటిలో ఏదో త్వరగా సరిపెట్టుకొను నెపముతో యింటి ముఖము పట్టెను.

పొలములో పర్యవేక్షించి సంతసించినవాడై ఉప్పొంగెను. అతను పొలములో తనకు వచ్చిన ఎరువునుజూచెను. పనివారిపై గలదురభిమానము మాయమయ్యెను. అయిననువారు అతనిని జూచి భయపడుచుండిరి. ప్రతివానికి అది సంతసము గూర్చినటులుండెను.

కిరణ్ ఇంటికి వెళ్ళితాను మరచిపోయిన దినసరి లెక్కపద్దులను వ్రాసుకొని వాలు కుర్చీలో కూర్చుని ఏవో ఆలోచించుచుండెను.

తెలంగాణ ప్రాంతము నుండి, చాల మంది కృష్ణా కాల్వల క్రింద సాగుభూముల ప్రాంతములలో నివసించుటకు వచ్చుచుండిరి. అర్జించుటకు మంచి స్థానములగుటవలన అచటికి ఎక్కువ మంది వచ్చుట గురించి కిరణ్ ఆలోచించసాగెను.

సెప్టెంబరు నెలలో అలస్యముగా వరినాటు కుండెను. ఎరగాపు వరి తారిపోయెను. వరికోయుటకూ రోజున సిద్ధపడిరి. "అయ్యా! వర్షము బాగావచ్చు చున్నది. మేము పనిచేయలేక పోవుచున్నాము. నేడు కూలీలకు కూలి గిట్టుబాటు కన్పించుట లేదు. వేసిన ఎరువులు వరదలో కొట్టుకొనిపోవునేమో." అని అనంద్ పనిగావచ్చి చెప్పెను.

కిరణ్ విచారించెను. అది ఆలోచించు స్థితిలోనైనను లేకుండెను.

అనంద్ యిల్లు దాటి వెళ్ళిపోయెను.

"ఏమిటి కిరణ్?" భూపేశ్ అడిగెను.

"ఏటులేదు నాయనా." కిరణ్ మారుపలికెను.

కిరణ్ మాట్లాడకనే వెళ్ళిపోయెను. భూపేశ్‌నకు ఏమియు తెలియలేదు. అతనికి కోపము కూడ గలిగెను. దాని అచూకి తీయమొదలిడెను.

అకస్మాత్తుగా భవనమంతయు గొప్ప వర్షమునకు గురై నీటిమయమాయెను. భూపేశ్ నకేమి యర్థముకాలేదు. చేయరాని పని యేదియో జరిగినదని భూపేశ్ తెలుసుకొనెను. వాన కోటులు లేనిది, గొడుగులులేనిది బయటికి వెళ్ళడము అనుకొనవని పనియాయెను.

భూపేశ్ ఒక ఛత్రిని గైకొని పొలముపై పునకు పోనిశ్చయించుకొనెను.

"అనంద్ తెలిసినంత వరకు ఇంటిలో ఏమి పని చేసియెరుగడు. నేనేదో పని చేయమనగా కిరణ్ కోపగించుకొని వెళ్ళిపోయెను." అని గోధ వంటింటి నుండి అరచెను.

"మీ గోల మీరు-మా గోలమేము" అని భూపేశ్ గొణుగుచు బయటికి వెళ్ళెను.

మరియొక యువకుడు యింటి ముందు వచ్చి నిలుచుండెను. గోధ అతనినడిగెను. "నీ వెవరవు?"

"నేనొక పనివాడిని. నా పేరు కుమార్."

గోధకు ఆ సమాధానము కటువుగా వుండెను. బయట వరద కొట్టుక వచ్చునట్లు ఇంటి ముందు వచ్చి నిలిచిన భృత్యుని గాంచలేక పోయెను గోధ. తనకు తానే సముదాయించుకొనెను. "అవును. నిస్సహాయుడు. ఏమి చేయగలుగును కనుక?" అని అనుకొనెను ఆమెకు ఎవరి పేరు వాలకమైనను కొంతతికమకగా యుండి యుండెను. ఇంటివద్ద పని పాటులో కన్పిస్తేనేగాని వారి వివరము గోధకు తెలిసెడిది. కుమార్ క్రొత్తవాడు.

కుమార్‌నకు కిరణ్ ద్వారము ముందటికి వచ్చుచుండగా కన్పించెను.

"రమేశ్ దొర ఏమి చేయుచున్నాడు? కుమార్!" అని కిరణ్ ప్రశ్నించెను.

కిటికి ముందుగా నిలబడి ప్రక్క భవనములో రమేశ్‌ను గాంచుచున్న కుమార్ "ఏమిలేదు" అని జవాబిచ్చెను

"సురేష్ ఈరోజు వచ్చినాడు." గోధ ఇంట్లోనుండి పలికినది. ఆవిడ వీరి సంగతిని అదే పనిగా చూచుచుండెను

ఇంతలో భూపేశ్ తిరిగి రానేవచ్చెను. ఇంతలో వర్షము తగ్గిపోయింది,

"ఏమివర్షమబ్బా!" అంటు సురేష్ బయటకు వచ్చెను

"అవునవును. ఎవవులు వేసివచ్చాము." అనుచు కిరణ్ మందలించెను. "బాగున్నావా? సురేష్."

" ఓ కిరణ్! అని" భూపేశ్ అరచెను.

" ఏమి నాయనా?" కిరణ్ అడిగెను.

"చేయరాని పని చేయవద్దని నిన్ననే పిల్లతో అనివచ్చాను. మబ్బుల పడుతున్నదని," అన్నాడు భూపేశ్, ఇంతలో సురేష్ "అవును" అన్నాడు.

"కుశలమేనా సురేష్ ?" అన్నాడు భూపేశ్.

" మీ అందరిదయ వల్ల ఇలావున్నాను. "

వారం రోజుల క్రితము కార్మికుల అధికారి (Labour Officer) యజమానులకు నోటీసులు పంపించెను. అందులో భృత్యుల కివ్వవలసిన నెలసరి జీతము గురించి తెలుపబడి యుండెను. కార్మిక సంఘమని యొకటి స్థాపింప బడెను. దానికి అనంద్ కార్యదర్శిగా పనిచే యుటకు ఇతర కార్మికులు ఒప్పుకొనిరి.

" అనంద్ ఒక్కడే కాదు. ఇతరులు గూడ వారి కార్యాలయమునకు వెళ్ళుచున్నారు" భూపేశ్ నుడివెను.

" నిజముగానా నాయనా ? " వారికేం ఫరవా! సంఘం వున్నది గదా! తిరగటానికి రైళ్ళు, మోటార్లు ఏర్పాటైవున్నవి. మరి అప్పుడు తిరుగనివి జీతాలు ఎలా దొరకగలవు?' కిరణ్ తిరిగి ప్రశ్నించెను.

"నీవు పనిని నడిపించుట యందు నమ్మకము గలిగి యున్నావా?"

" కొద్ది మాత్రమున కాంక్షించుచున్నాను. "

" నేమరిచి కావద్దు. "

"ఏమిటి కుమార్? నీవేనా? ఏమైనావుందా?" అని అందరు ఒకేసారి అతనిని ప్రశ్నించిరి.

" గండ్లు పూడ్చినామని చెప్పిరమ్మన్నాడు ఆనంద్." అన్నాడు కుమార్. " మరికొత కూలీల గురించి తెలుపమని చెప్పాడు. "

"సరే నిజమయింది కదా ; రేపటినుంచి నువ్వు వెళ్ళి కూలీలతో చెప్పివచ్చాను. ఏమయితే నాయుగూడా పనిపోతుంది.', అన్నాడు కిరన్.

కష్టములు, పెను పరిస్థితులు చిన్నవైనను, చాల వరకు కిరణ్ మనస్సును వేధించ సాగినవి.

కిరణ్ విజయపురము వచ్చిన పిదప జీతగాండ్రు కార్యాలయములో ఫిర్యాదులు చేయుట పరిపాటి అయిపోయెను. అది అసహ్యమై పలకని భావముల సంస్థగా యజమానులు అనుకొనుటకు తయారయ్యెను.

కొంతమంది జీతముల లెక్కలను చెప్పుకొనుటకు కార్యాలయమునకు వెళ్ళుచుండిరి. వారి వారి యజమానులు ముందుగనే అధికారుల మెప్పించుటచే భృత్యులు వృధాగా తిరిగివచ్చు చుండిరి.

ఈ నూతన దృష్టి కృషీవలుర కాలమును దుర్వినియోగము చేసినదై కొంత పెడదారి త్రొక్కించినదయ్యెను. కూలీలు న్యాయముగా పనిచేయక పోవుట రైతులకు బాధగాయుండెను.

విప్పము పెట్టుబడులతో జీవించు భృత్యులకు నియమిత జీతము వచ్చుదయ్యెను. వారిలో ఐక్యత కొరకు యజమానుల మెప్పును కాంక్షించిరి. అధికార నియమములు స్వప్నము లాయెను.

ఎప్పుడైనను కార్యాలయమునకు వెళ్ళినచో పనుల చక్కబెట్టి భూపేశ్‌తో చెప్పి ఆనంద్ వెళ్ళుచుండెను.

మరుసటి రోజు ఆనంద్ కార్యాలయమునకు వెళ్ళెను. కిరణ్ పనులన్ని సరిజూచుకొని సంతసించెను.

భృత్యుల జీతముల వివరములు అధికారులకు సన్నవగా చెప్పుచు కొన్ని విషయము లలో వాదించుచు యిటు సహచరులను గూడ మెప్పించెడి వాడు ఆనంద్. ఈ విధముగా ఆ ప్రాంతమున యజమానులతో గూడ ఆనంద్ అనతి కాలములోనే కీర్తింపబడెను.

ఆనంద్ చదువు కొన్నవాడు. వివేకి. కర్తవ్యము నెరిగినవాడు.

సురేష్ భాగ్యనగరములోని బ్రతుకు తరహాను గురించి సంతసించెను. అచటనే ఆర్జించుకొను దశతనకు కల్గుననియు తలంచుచు ఉవ్విళ్ళూరుచుండెను. అతడు ఆనంద్ పై అభి మానమును ప్రదర్శించెను. చాల మంది సురేష్‌ను అభినందించుచుండిరి. ఆంధ్ర సంస్కృతిని గురించిన అన్యోన్యతకు ఆనంద్, సురేష్‌లు ఆదర్శులని పెక్కుమంది అనుకొనుచుండిరి.

ఎప్పుడు వర్షా కాల మొచ్చినను పొలములను దర్శించిన పిదప సురేష్ క్రొత్త క్రొత్త మార్గముల ద్వారా వచ్చెడివాడు. ఎక్కడెక్కడ గుడిసెలు కన్పించినను, ఎనుగునాటిన ప్రదేశముల చూచినను పోలికల భేదాలను నిర్ణయించుటలో పట్నము తుమ్మ, తుమ్మ సంబం ధముల గని ఆనందించెడివాడు. పట్నము మనిషి గుణము పల్లె మనిషి గుణముల సాదృ శ్యము పోల్చుకొనెడివాడు. మార్పును కూడ ఎంచుచుండెను

ఆరోజు పశ్చిమ దిశలో సుందరాంగి యొకతె విరహ గీతము నాలాపించుచున్నటుం డెను. ఆనంద్ తదేక దృష్టితో సంధ్యాదేవిని వీక్షించ యత్నించెను. సాయంత్రం కార్యా లయము నుండి తిరిగి వచ్చుచున్న ఆనంద్ ఒక దీనురాలగు స్త్రీని గాంచెను.

"ఎవరమ్మా! నీవు?" అన్నాడు ఆనంద్.

"ఏముంది నాయనా?! పెళ్ళయి రెండేండ్లు. మా యింటాయన కేంపనిలేదు. లేని పెత్తన మొచ్చిందని తెల్లవార్లు తప్ప త్రాగుతు చెడ్డ వాళ్ళతో తిరుగుచున్నాడు. వస్తుండి చచ్చాను. నాగతెంకావాలి నాయనా!"

ఆనంద్ విస్తుపోయి చూస్తుండగనే సురేష్ పొలము నుండి తిరిగి వస్తువారిని జేరెను. మనిషి దుర్గుణముల చీకటిని సురేష్ కనుగొనెను. ఆవిడ యెవరో, సురేష్‌నకు తెలిసి వచ్చింది.

కిరణ్, సురేష్, బాబు కలిసి చదువుకొను రోజుల్లో బాబు, లేని పెత్తనముతో అందరిని భయపెట్టువాడు. వారికన్న ఏడాది పెద్ద. అప్పుడప్పుడు తిరిగే వక్రశైల్లు తీరికగా యితనికి తప్పుత్రాగించడము వలన భార్యను కూడా పోషించని పరిస్థితిలో యుండిపోయెను. ఆనాడు ఆ విషయం సురేష్‌నకు తెలిసివచ్చింది.

"నువ్వెవ్వరు?" చీకట్లో భయపడి అన్నాడు సురేష్,

"నేను ఆనందునండి కిరణ్‌గారి వద్ద కుదిరిన జీతగాణ్ణి"

సురేష్ జాగ్రత్తగా యింటి మొహంపట్టాడు.

ఆనంద్ కావిషయము తెలియదు. సరికదా జాలిజెంటి తనవద్ద నున్న సావులో, బేడో యిస్తామని అనుకొన్నాడు. కాని సురేష్ కొందరపాటును గమనించి అతను కూడ యింటి మొహంపట్టాడు.

దారి మధ్యలోనే బాబు గృహం వుంచి. బాగా తప్పత్రాగి పడిపడివున్న ఆతని వాల కము అతి నీచముగ వుండెను. ఆనంద్ విస్తుపోయి వారి గతి కూకటిగ్రేళ్ళకు తగిలినచీడను గురించి అనోట విని అంటుసొంటు లేని అమాయకుని వలె వుండి పోదలచెను.

విశ్వమంతా వినుతింప బడుచున్న దేవతామూర్తియై సర్వజనులను మాతృ వాత్సల్య ముతో లాలించుచున్నది. భయంకరమగు యుద్ధములు తన సంతతి చిలిపి చేష్టలు. మాతృ మనము నెరిగిన వారు లోకములో అరుదు.

మసనాడు బాబు భార్య రాజ్యం విధిలేక కిరణ్ పొలంలో కలుపుతీయు కూలిమనిషిగా వెళ్ళింది. ఆనంద్ ఆ విషయమును పూర్తిగా తెలుసు కొన్నాడు.

పొలంపని జూచుకొని కిరణ్. ఆనంద్ యింటి ముఖం పట్టు వరకు చీకటి పడిపో యింది. బాబు తనయింటిముందు యధావిధిగానే మైకంలో నానా తిట్లు తిట్టుచుండెను. ఆనంద్ ఆ పరిస్థితిని జూచిఎంతో విచారించెను. రాజ్యంస్థితిని తెలుసు కొనిన వాడై ముందుగానే కూలి డబ్బులు యిప్పించాడు ఆనంద్.

చీడపురుగుల వలె లేని పెత్తనాలు, అధికారములు మానవ జాతిని కృంగదీస్తున్నవి. నీతి, నిజాయితి శాంతి ఫలించెచోట లేని పెత్తనాలు వున్నంత కాలము మానవ హక్కులకు భంగం వాటిల్లుచునే యుండును,

మనిషి బాధ్యత నెరిగినచో భాగ్యం వెంటాడి వచ్చును.

కార్యాలయములలో తిరుగుటకు ఆనంద్‌నకు విసుగు కలిగెడిది. ఎంతో మంది అను కొనిన రీతిగా కార్యాలయములందు తమ పత్రములు మాయమైనటు వంటి ఘటనలు పనికాక పోవడము రీత్యా విచిత్రమయ్యేడివి. అందుకే వాటిని "ఆఫీసు భూతము" లనెడి వారు " అందు ఉద్యోగులకు భూత వైద్యము చేయించు నవశ్యకత యెంతైనా యుంటుంద" నిపలువురు నవ్వుచు అనుకొనెడివారు.

# 6

రమేశ్, సురేష్ వున్నగదిలోని కప్పుడే వచ్చెను.

"లేదు. నిన్ను నా బిడ్డను యే మాత్రము చూచి యిష్టపడకున్నాను. మీ యొక్క ప్రసన్న కార్యకలాపములు అక్కర వచ్చుపని పాటులుకావు." రమేశ్ అన్నాడు.

"ఏమి చిన్నాయనా?" సురేష్ అరచెను.

"లేదు. లేదు. లేదు."

సురేష్ సిగ్గుజెందెను. అతనుమాటుపలుక లేదు.

కొద్దిసేపటికి సరళకొట్టు గదినుండి బయటకు వచ్చెను. సురేష్‌ను చూడగనే అవిడకు జాలిగలిగెను

"ఏమిటి? సురేష్" ఆవిడ అడిగెను.

ఆవిడ ప్రశ్నకన్నముందు గానే సురేష్ యేదో చెప్పదలచు కొనెను.

సరళ తిరిగి అన మొదలిడెను. "నీవు నీ జీవితమును గూర్చి ఆలోచించినావా?సురేష్! ఇక్కడక్కడ వృధాగా ఎందులకు తిరిగెదవు? నీ పని ప్రయోజన కారియేనా? దానివల్లయేమి సంపాదించెదవు?"

సురేష్ మందహాసమును కనబరచెను. తిరిగిఅనెను. "చిన్నమ్మా! నేనేమియుచెప్పలేను నేను ప్రకృతి యొక్క మంచి సమయము కావలెనని కోరుచు వేచియున్నాను. నా అదృష్టము నా ఖర్మ."

రమేశ్ గదిలో నిటు నటు తిరుగ మొదలిడెను. అతని కది అక్కరకురాని సమయ మయ్యెను.

"సురేష్ నీ తల్లిదండ్రులు యున్నప్పుడు నీవు పిల్ల వానిగావుంటివి." "రమేష్ అనెను." నీ వొక వైద్యునివి కావలయునని తలంచుచున్నాను. కిరణ్ వ్యాపారవిషయముల ప్రసంగము లేమిటికి? నీ చదువు సంధ్యల శ్రద్ధలన్నియే మైపోవుచున్నట్లు?,,

"రమేశ్ చిన్నాయనా!" గట్టిగా సురేష్ అవగలిగెను.

కిశోర్ ఈ విషయమంతయు తిలకించుచుండెను.

సురేష్ వారందరి పై మండిపడెను.

"నేనీ విషయములన్నిటిని భరించలేను." చిట్ట చివరకు అరచి గది నుండి బయటికి వెడలిపోయెను, రమేశ్.

సురేశ్, రమేశ్ ధోరణిని తలంచి వాపోయెను.

రాత్రివేళ కిరణ్, సురేశ్‌ను గాంచెను. సురేశ్ గదిలో ఒంటరిగా దీర్ఘాలోచనలో మునిగి యేదో ఆలోచించుచుండెను.

"సురేశ్! " కిరణ్ కరచెను.

సురేష్ అతని పలుకులు వినలేదు. కిరణ్, సురేష్ దగ్గరకు వచ్చి పలుకరించెను.

సురేష్ అతని వైపు చూచినవ్వెను. "కిరణ్ కూర్చొనుము" అనెను.

వెంటనే యిద్దరు కుర్చీలలో కూర్చొనిరి కలయచూచిరి లభించిన సమయమున యిద్దరి మనసులు ఏదో విషయమును ప్రస్తావించినవి.

ప్రారంభించిన అదృష్టము గుసగుసలాడినది. వారిపెదలు విజయముతో, గొప్పదనముతో ఆనంద దోలికలూగినవి. ఆలోచనల అవిరులు వారి మనస్సుల యిచ్చల నుండి ఉత్సాహ పరిధుల చేసినవి. వారు కృత్రిమ ఎరువుల కోరినవారై సహజమైన పశువుల ఎరువును తలంచకుండిరి. తెలిసిచూచినవారై గాలి తాకిడికి తట్టుకొనలేక పోయిరి. అది యొకవిధముగా నూతన ప్రయత్నముల ప్రబోధ వలె వారిని మందలించినట్లులుండెను. అదే విధముగా వారికి నూతన ప్రయత్నముల మీదనే అభిలాష జనించినటులుండినను, సంప్రదాయ భావముల తృణీకరించ జాలని ఆందోళనతో చిక్కుసమస్య యెదురయ్యెను.

వారిద్దరు గదిని వదలి వెళ్ళిపోయిరి.

రాత్రియంతయు సురేష్‌కు నిద్రపోవుటకు వ్యధ కలిగెను. ప్రతి విషయము చులకనగా కన్పించెను ఎవరుదానిని వ్యతిరేకించగలరు?.

నిగూఢముగా గాలి పొడిచినట్లుగా కిటికిద్వార లోనికి చొచ్చుకొనెను. ఆలోచించుచు కుర్చీలో విశ్రాంతిగొనెను. అతనుద్వారపు తలుపులతెరచెను. ప్రకృతిని తిలకించసాగెను. అది నిశ్శబ్ద ప్రశాంతము నావరించెను.

చిట్ట చివరకు పదకొండు గంటలవేళ అతను నిద్రపోయెను. మరునటిరోజు కాలమంతయు మామూలుగాగడిపెను. మనసు ఆహ్లాదమునే కాంక్షించు స్నేహాభిలాషియగు ఉద్వేగమునై ఎదురుచూచుచున్నట్లుండెను. దినమంతయు గడచిపోయినది. కళ్ళు గాజువలె కాంతి ప్రసారకియంగములో సైకతములోని చురుకుదనపు క్రియాత్మకమగు గాజురూపమును తలపోయుచు ఆ విషయమును శ్రద్ధగానిశ్చయించుకొనిన వాడయ్యెను. కర్తవ్యము నాలోచించుచుండెను.

కష్టముల విజ్ఞానము ఏ విధముగనో దేనినో బోధించుచున్నదని సురేష్ గట్టిగా నమ్ముచుండెను. ఆపదలు అడవులపాలై పలుమారుల ఎదుట జరుగుచుండును. సౌఖ్యములను గట్టెక్కి వంతహాయి ననుభవించకయే మారుమూలలో ప్రమాదములకు గురిఅగుటయు వాస్తవమే.

ఇసుక రేణువులను, నేలరకములను తాలుప్పలను ఒరుసుకొనుచు నేర్పరచుచు దృశ్యస్థల పరివర్తనముల నదులు రక్షించుచున్నవి. సురేష్ భావముద్రిలరీతి తలపోసెను.

పెద్దజాల పక్కన అడుకొన్న మొదటి అభిప్రాయమున, వాటి గుంకజాళ్ళ దశను గాంచి విస్మయపడుచుండెను. వాటి పైన చిన్న మొక్కలనుపుంచి వాటిజీవితము ఈతలోని ఆనందపు భావము గలుగ కదిలించుచు అడుకొనుట సురేష్‌నకు యిష్టమైనదిగా యుండెను.

వరదల సమయమున పడవల అగత్యము తప్పనిసరి అయ్యెను. ఆ ప్రమాదములు వచ్చినప్పడు చిన్న చిన్న చెక్కలను దగ్గరగా కట్టుకొని గట్టెక్కు నుపాయములు అచటి వారికి పరిపాటి ఆయ్యెను. పొలముపక్క వాగులో సురేష్ అడుకొనుటకు గూడ అటువంటి చిన్న చెక్కలనుపయోగించి ఈదుచుండుట అతని కలవాటుగా నుండెను.

అతను అర్ధమినిలిత నేత్రిదృష్టితో నదులు కల్పించు చిహ్నోపాయ భావవిధముల తలంచుచుండెను.

# 7

నాగార్జున సాగరము నన్వే జలకన్యలతో మాట్లాడు చున్నట్లుండెను. జీవితపు పాట్లను త్రోయుచు ప్రక్కన వున్న గొయ్యిలాంటి కష్టములలో పడి ప్రమాదమునకు గురియగుటను కాంక్షించను. అదియొక విచిత్రమైన సంగతి. నాగరికత అభివృద్ధిజెందిన దేశములలో మనిషి యాంత్రిక విలువలకే ప్రాధాన్యము గలదు. బ్రిటన్ లోని ప్రజలు అమెరికా లోని జనులు యాంత్రికంగా తమకార్యముల నెరవేర్చుకొను చున్నారు. భారతీయుడు తన కృషిఫలితమును వీక్షించినట్లుండెను. సమయ కారుణ్యములు సాంఘిక పరిస్థితులు అంతటను దైవాధీనములై యుండెను. భారతీయులకు భక్తిమెండు.

ప్రపంచ యాత్రా కేంద్రముగా నాగార్జున సాగరము ప్రకృతి సౌందర్యముతో తుల తూగి మెప్పుపడసినట్లు మైమరపించుచున్నది. ఆనకట్టల ప్రదేశములలో ప్రజాహిత కార్య పరమగు ఒప్పిదమగు విధి ప్రత్యేకమై యుండెను.

అదృష్టపు ఘడియ ఎచ్చటను దూషింపబడదు. గౌరవము, శక్తి మరియు ఉత్సాహము కీర్తింపబడినది.

బానిసలు ఎప్పుడును ఉత్తమ జీవితము గడుపుట సంభవించలేదు. నాగరికత చిహ్న ములు సామ్యముగనే సంస్థలలో పొడచూపినవి.

సురేశ్ యవ్వనుడు, భవిష్యత్తును తలపోయుటలో గట్టివాడు అతను దయార్ద్ర హృద యుడు. చాలాకాలము సాంఘిక సంస్థల గురించి విచారించెను.

సమాజ సంస్కారసాధక బాధకములు ప్రత్యేకముగా నిర్ణయించరానివై యుండెను. సురేశ్‌నకు అవియన్ని ముల్లు గుచ్చినంత బాధను కలిగించినవి.

ప్రతి మనిషి వానిమనుగడ పై ప్రీతిగలిగి యుండెను. జీవితమున కది బాహ్యపుఅట కాయింపు వలెయుండి యుండెను. సామాన్యులు ఎన్నడును కీర్తిదర్పణమున చూపబడు ప్రగతిని గాని ఫలమును గాని చెరచినవారు గాదు. కానుగవ్యకు పనికి వచ్చు కార్యమును చేయక పోవడమేకాక ఎంతో అమూల్యమునకు తూగు లాభము కలిగించుటయే వారి కృషిలోని జీవము. విధిబంధములోని దురదృష్టము తో వారు సతమతమైరి.

నేలనుచదను చేసుకొని బాటను నేర్పరచుకొన్నట్టు చాలాకాలము పిదప ఉపయోగకరమగు ఆదర్శవంతమైన జీవితము తుపెవరకు సాగుటకు దారి నిశ్చయమైనది.

నిశితబాధాకరమైన బ్రతుకు నాగరికత దశయగు రహదారి వరకు ఉపయోగకారి కాలేదు. పనిలో యే మాత్రము పసలేకుండెను. బాటలను నిర్ణయించుటలోని బుద్ధిబలములోని గొప్పతనము తెలివి తక్కువ తనము లోని నిర్ణయములే నిజముగా నేడు రాజకీయమున గోచరించుచున్నవి.

మధ్యకాలములో విద్య మరియు నాగరికతలుదయించినవి. కావున అప్పటివరకే అవి ఫలవంతము కాలేని స్థితిలోవుండెను. అన్నివైపుల ప్రగతి యొక్క ప్రకాశమానమగు ప్రవాహమువలెతోచెను.

నాగరికతా విప్లవమొకసంగతి: నిర్దుష్టము కాని ప్రతి బంధకమగు శాసన కార్యక్రమ మొకసంగతి. ప్రజాజీవితము లో దైనందినపు బ్రతుకు దుఃఖ భూయిష్టమైనది. అనుబంధ సహాయ పథకములు స్నేహితుల ప్రయోజన కార్యములగు అవకాశములయ్యెను.

సురేష్ ఒకకాసునైనను సంపాదించలేకుండెను. అతనికి తన అస్తియే ప్రధానమైనది. అన్ని అవకాశములవైపు దూరదృష్టిని సారించి వర్తించెను. అవహేళన వెంటాడినట్టి విషమఘడియలే ఎప్పుడును తటస్థించినవి.

నాగరికత ఉత్తమ కార్యపుటవశ్యకతను తెలుపుచున్నటులనుండెను. సామాన్యప్రజలు కూలిని అదృష్టమనియు స్వేచ్ఛకు ప్రతీకమనియు తలంచుచుండిరి.

మానవ కృషి కిరీటము దింపబడుటను సురేష్ వచ్చలేదు.

ఎచ్చట చూచినను మానవకష్టము సాధనాత్మకమై బరువుగా నుండెను. సురేష్ దానిని గమనించెను.

అతనుమేమి తిన్నను అతను యేమి త్రాగినను పరిస్థితుల ప్రారంభగతిని ఆకళింపు చేసుకొనెడివాడు. దయ అతనికి తోడయ్యెడిది. భూతకాలపు చిన్నదీపముముందు వర్తమానపు విద్యుద్దీపము వెలుగు ఇనుమడింపు తేజమును ప్రసారము చేయుచుండెను. భవిష్యత్తు నెరుగకుండెను. ధైర్యముతో కృతనిశ్చయుడై ఉత్సాహముతో, ముందడుగిడి, నమ్మికకన్న యేమి గోరువాడు కాకుండెను.

అతను తల్లిదండ్రుల పై ప్రేమకలవాడు.

బాధలను వని పిసిరి వేయబడిన బాలవలె పరిస్థితులు తన పథమున కుప్ప బోయబడిన రాబడులయ్యెను.

కృష్ణానది ఆవకట్ట ప్రాంతమున నిలిచి సుగర్వతాత్త్విక ధర్మనిష్ఠా గరిష్ఠ తోయములతో మానవవాంఛల నీ దేర్చు ప్రబోధల చేయు చున్నదేమో యనునట్లు గన్పట్టును. ఒక స్వంత నిలయము మరియు గమ్యస్థానము ప్రత్యేక దృక్పథమును కలిగియున్నవై తమ విధి కార్యనిర్వర్తనమున దృష్టిని సారించుచున్నవి.

# 8

సురేష్ మరియొక తడవ తప్పని సరి భాగ్యనగరమునకు వెళ్ళుట జరిగెను. రమేష్ మరియు సరళ అతని పై జాలిజెందిరి.

సికతని అతని వైపు జూచి నవ్వెను.

భావములు మరియు ఆలోచనల మానవ అడ్డంకులు ఎప్పుడును విధి బలీయములై యుండెను.

ఎవరు అదృష్టమును తిరస్కరించగలరు?

చరణదాసు అను సంస్థ యొక్క గొప్పతనమును సురేష్ వినెను. ఆ సంస్థ లోని వ్యక్తులనడవడిను గమనించుటకు అతనెంతో కృషిజేసెను. భాగ్యనగరము నందు ఆ సంస్థలో పని చేయుటకు సురేష్ ప్రయత్నించెను. అందులోని వ్యక్తుల పరిచయము సంపాదించుకొను అగత్యము కలుగక పోయినను యజమానినే కలుసుకొను అదృష్టము మాత్రమతనికి దక్కుట కొనియాడదగిన విషయ మయ్యెను. ఆ సంస్థ యజమాని చరణదాసు స్వయముగా మంచినడవడి గలవాడై వినయశీలుడై యుండెను. మనిషి సుగుణముల వెలుగులో బ్రతుకు సాగించుటకు సురేష్‌నకు సమయమొచ్చెను.

గదిలో చరణదాసు ఒక్కడే వుండెను.

"ఎవరక్కడ?" చరణదాసు అడిగెను.

"నేను మీ సంస్థలో ఉద్యోగము కోరివచ్చినాను." సురేష్ అనెను

"చాలసంతోషము. లోనికి రమ్ము." చరణదాసు అనెను. "ఒంటరిగానే వచ్చినావేమి? ఎవరైనా నీ గురించి తెలుపువారు లేరా?"

సురేష్ నిజముగానే భయపడెను. ఎవరును పరిచయము చేయుటకు లేరు కదాయనియూ, ఇకతనకు ఉద్యోగము దొరకదనియు అతనను కొనెను.

"బి,కాం. మాత్రము చదివినానను సంతోషము మరియు ఉద్యోగము చేయవలయునను ఆరాటము దప్ప పరిచయస్తులెవరును లేరు!" అన్నాడు సురేష్.

"ఫరవాలేదు." చరణదాసు అనెను. "నీ వేమైనబాధ పడినావా? అది చాల చిన్న విష యము. తెలివి తేటలు స్వయంగా అందరిమన్నన పొందును. నేను కష్ట నిష్ఠురములను పరిశీ లించువాడను. వాటి భిన్న పరిస్థితులలో ప్రేమ ఒక ఫలమేలకారాదు?"

సురేష్ అతని వైపుజూచి వినమ్రుడై యుండెను." మీ గొప్పతనమును వేనోళ్ళ విన్నాను సుమండి. ఇప్పుడు నిదర్శనముగా చూచుచున్నాను." అని తిరిగి సురేష్ పలికెను.

నిశబ్ద ప్రశాంత వాతావరణము నేమియుమార్చ లేదు.

అప్పుడప్పుడు కొన్ని ప్రత్యేకమైన విషయములను సురేష్‌నకు తెలుపుచు తన భవన మునకు గూడ అతనిని వచ్చిపొమ్మని తెలిపెను. రోజులు గడచిన కొద్ది సురేష్ నిశ్చల శాంతి పరిస్థితులను ఆ పరిసరములలో అనుభవించెను.

చరణదాసు ఏకైక పుత్రిక రూప అతనిని సన్నిహితునిగానే చూచుచుండెను. ఇది యే మాత్రము చరణదాసునకు తెలియదు. ఎందుకనగా రూపయొక్క పడవడియే కారణమై యుండెను.

రూప మరియు అవిడ తల్లి రేఖ అతని కెంతో ఆప్తుల వలనే యుండి యుండిరి. రూప అప్పటికే ఇంటరు ప్యాసయ్యెను.

యంత్రాంగముల సంస్థనొక దానిని చరణదాసునకు అతని తండ్రి ఆస్తిగానిచ్చెను, దాని వలన బాగాధనము నార్జించెను. ఆ సంస్థ చరణదాసు పేరనే కీర్తింపబడెను.

చరణదాసు తన యవ్వనము నుండి నగరములో దానినినడిపెను. యంత్రపరికరముల విడిభాగముల సంస్థను నిర్వహించుచు ప్రపంచములోని ప్రతి ప్రాంతమునకు సేవచేయ నిశ్చయించెను. ఇతరుల అభిమానము చూరగొనెను. పనివారి వినయ వివేకము, నేర్పుచే చరణదాసు యంత్ర సంస్థకు పేరు వచ్చెను.

సంస్థపై, యంత్రముల నిర్మాణముపై సురేష్‌నకు ఆదరాభిమానము కలిగెను. కొంద రుపని వారు అదర్శ జీవితము గడిపి యంత్రముల నిర్మించుటలో నేర్పరితనమును కనబరచు గొప్పదనమునకు తగియుండిరి.

ఇది వాస్తవముగా అతనికి నిర్వహణ భారమైయుండెను.

సురేష్. మానవత్వపు పట్టుదలల ప్రతి బింబములతో విజయ నగర ప్రాంతమున వినుతింపబడు వ్యక్తి అయ్యెను. ఒక విశాలమైన పరిశీలనలోని అంశములు సాంఘిక వ్యవస్థ యందు పునర్నవ మొందినట్లు సురేష్ పై ముద్రవేచు కొన్నవి.

యంత్రముల పనితనము ప్రపంచ ప్రభావితమైనదై యుండెను. సురేష్ సంకుచిత మనస్కులగు వారి మీద దయకనబరచుచు భాగ్యనగరమున ఉద్యోగమును నిర్వహించు చుండెను. అన్ని పరిస్థితులను దయతో జూచెను. అతను ఉత్సాహముగా బ్రతుకుచుండెను.

కొన్ని తడవల అన్నిజాతుల గురించి కొన్ని అభిప్రాయములను తలపోసెను. అప్ప టికే ఆంధ్రప్రాంతమున ప్రబలిన బహాయి మతము శాఖోపశాఖలుగాఅయి భాగ్యనగరమున ప్రధాన కార్యాలయము నడుపబడుచుండెను.

రూప మరియు రేఖ ఎప్పుడును అతనిని ఆదరించిరి.

వారి సౌజన్యమును మెచ్చుకొనుచు భవిష్యజ్జీవనము గురించి తలపోసెను. కిశోర్ దృష్టికి వచ్చినపుడెల్ల అతనిలో సోమరితనము భయపడి పారి పోయినట్లుండెడిది.

సురేష్ కఠినమైన బాంధవ్య గమ్యమును కలిగియుండెను. అదియును గాక చరణదాసు యంత్రసంస్థను పైకి తెచ్చుటయు అతని కృత నిశ్చయమై యుండెను.

విశాలహృదయ నిర్వహణ భారము, ప్రగతిని సాధించు ఉత్తమ అంశములు చరణ దాసునకు మంచికీర్తి ని తెచ్చినవి. అతను సురేష్‌ను అమితముగా ప్రేమించెను. వాస్తవిక సాధ నను సురేష్ చేపట్టుటచే నిజమైన ప్రగతి జెందెననుట సంస్థకు అతని చేయూత చిరునవ్వుగా కష్టనిష్టురముల ప్రమేయములలో స్వంత ప్రభావము స్వార్థజీవనమును పరాభవించెను.

సోమకుడు చరణదాసు సంస్థలో ఒక బంట్రోతు యుండెను. అతను కురువృద్ధుడు. చరణదాసు అతని వృద్ధాప్యము గురించియే వుద్యోగము నిచ్చెను. అతడు పరిమిత విద్యావం తుడై యుండెను. తగినంత శ్రమతో తెలుసుకొనగోరినను అతనికి సులభ సాధ్యము కానిదై పోయెను. అతను ప్రతి యొక పుస్తకము నిష్టపడెడి వాడు. అతను మితిమీరి కుంచెను ప్రేమిం చెను. చిత్రలేఖన మతనిని ఆకర్షించినదై యుండెను.

రూప అతనిని గని ఆశ్చర్యచకితురాలయ్యేడిది. అతను అవిడను చిత్రలేఖనము నేర్చుకొన గోరి ఒక రంగుపెట్టెను అడిగెను.

కాలము అర్రులు చాచినట్లు రూప యేవగింపు బలహీనమై పోయి అస్తవ్యస్తముగా యుండెను.

"వీలు కొరకు ఎదిరిచూడుము. నాకుంచెలు క్రొత్తవి. నీవేదైన పాతదానిని పొందుదువు" రూప చెప్పెను.

సోమకుడు బరువు నే మాత్రము తలవకుండెను.

# 9

కిరణ్ సోమరియని సురేష్ యెప్పుడును అనుకొని యుండలేదు. సదవకాశమును నిరూపించుటయే సురేష్ యత్నమై యుండెను.

ఒకనాడు అతిశీతలముగా ప్రకృతి ప్రభావితమై యుండెను. సూర్యుడు గ్రుంకుటకు సిద్ధముగా యుండెను. సురేష్ దృష్టికి తెచ్చుకొను చుండెను.

రూప గది లోనికి వచ్చినది.

"నీ వెలాగున్నావు? సురేష్!" రూప అడిగెను.

"బహుశః నేను అవకాశపు పరిస్థితితో యగుపడుదును." అని సురేష్ బదులు చెప్పెను.

"నీవు మానవత్వము లోని ఆలోచనలను పరిశుద్ధము చేయగలవా?"

"దైవానుగ్రహమువల్ల. ఏ అదృష్టమును ఏ యవకాశమును యింతవరకు వంతుగొనలేదు"

"లేదు నేను అసలుకే అది యిష్టపడను. ఎవరికి బ్రతుకులో యందము కన్పించును? మరియు ఎవరికి బ్రతుకుపై ప్రేమగలదు?"

"అదియంతయు నాకువట్టిదే. నేను విధిని తిరస్కరించను."

"విధి ఏ విధముగా మార్చును?"

సురేష్ భవిష్యత్తు యవకాశము గురించి ఆతురతజెందిన వాడయ్యెను. స్వయంవాదముతో భవిష్యత్తును ఊహించుటకు యత్నించుచుండెను.

పెద్ద కార్యకలాపములయందు జీవిత సహాయకారిగా నేరుగా యత్నమువన్నియు అతనిని నిలిపినవి. పరిశ్రమతో అతను రహస్యాలోచనము చేయుచుండెను. స్వయం వాదముతో పోరాటము సాగించెను. అప్తురాలుగా రేఖగూడ వెంటనే వచ్చెను.

రేఖగూడ అతని జీవితము గురించి అడిగెను. "నీ జీవితము గురించి ఎట్లు అనుభవించుచున్నావు?"

"అది యొక గమ్యమని తలంచుచున్నాను." అతనవెను. రేఖ అతని వైపు ఆశ్చర్యచకితురాలయ్యెను.

"చాల విచారకరము. సురేష్ నీ అదృష్టమును ఎవరు కాదనగలరు?"

"జీవితము ఉన్మత్త పుష్పము వలె భాసించ లాభమేమి ముళ్ళచాటు గులాబివలె జీవితము వికసించినచో యందము ఆనందము కలుగును. ప్రకృతి స్వభావములోని ఈ తారతమ్యమగు నాట్యకళ కేది విశ్రాంతి?" అని అసంపూర్తిగా సురేష్ అనెను.

"జీవితము మాయ గానిచో అలా తలచకుము."

"ఎప్పుడును ఆతురతతో అవకాశ విషయముతో ప్రీతి విషయము అంటు కొనరానిదై యుండి యున్నది."

"అదయేమై యున్నది?" రేఖ ప్రశ్నించెను.

"చెదిరి పోయెడి మనఃపాశము; ప్రీతిన మొదలగునవి అంటుకొనరానివే. కాన మోసపుచ్చెడి చేయగునది పరాజయము."

"మచ్చునకు ఏది స్వంతము మరియు సర్వము యనవచ్చును?"

"గుణ ప్రధానము కానిది, తనది కానిది స్వంతమునదు. పరిశుభ్ర మనదిది సర్వాంగీకారముకాదు."

ఇది యంతయు చరణదాసునకు అంతః మనః పరితాపమును కలిగించెను. అతను ఎన్నడును అటువంటి భావనలు గాలినీరు ఉష్ణము లాంటి వివిధ వ్యక్తుల కలయికల అనురాగ బీజముకు ప్రొద్దస్తమయములలో అంకురరళ సహకారుల నెరుగడు.

సురేష్ సంపాదన నుండి అదో యిదో అనునట్లు కూడబెట్టెను. డబ్బు నిలువ జేసెను. ఎప్పుడును వ్యసనముల పాలుకాలేదు. జూదమునకు దిగలేదు.

అతను స్వయం అవకాశపు కష్టపు పనితో ఓర్చి అక్కరకురాని వాటిని విడిచి పుచ్చెను.

కొన్ని తడవల సాంఘిక పరిస్థితులు అతని పై పని నిర్వహణలో ముద్రవేసినవై ప్రభావము కనబరచినవి.

వినయముగా సురేష్ తన ప్రియమైన వాదనను తిరస్కరించ లేదు.

స్పృహదప్పిన సముద్రపుటలలు తటాకపుటలలు సమానముగా అభ్యాసము చేసిన భావతత్త్వమును కనులకు గట్టినట్లుగా పరిశుభ్రము జేయుచు మరుగులాంటి యోచన లోతైన నీతివలె కప్పట్టును. పరిపక్వ విద్య దానికి మూలమై ఆకర్షణీయమై శ్వాసించు యందమే ప్రకృతి పోరాటమున వచ్చును.

పరిస్థితులు ఎట్టైనను గౌరవమునే ప్రతిపాదించినవి.

సురేష్ చాలాకాలము వినయ పరిశీలనముగలిగి ఎచ్చట యిచ్ఛాజీవితము గలదో దానినే ప్రేమించెను.

ఎప్పుడును కిరణ్ అట్టి స్నేహలభ్యము బంధుత్వ పరమైన నదవకాశము చిక్కక ఆ పరిస్థితుల నెదుర్కొనుచుండెను.

సురేష్ అట్టి గట్టి విధి విషయమునే పొందెను.

క్రమముగా సురేష్ అలవాట్లను మంచిస్థితికి పూర్వపు నాగరికత బంధుత్వముల పరముగా పెంపొందించుకొనెను. అతను తిరిగి వేరొక మార్గమున యితరుల బ్రతుకుల సమస్యల పరిశీలన జేసెను. కిరణ్ యొక్క నీతి వంతమగు ఆదర్శ జీవితమే యితనిలో ప్రతిబింబింప జేయుచుండెను.

ప్రకృతి ప్రకాశమానమై మెరసెను. విధియందచు అతనిలో గుసగుసలాడెను.

అది ఒక ఘడియకాలమై యుండెను, అతను దానిని చేరలేక పోయెను, ఎప్పుడైనను సాధ్యము కాకుండెను.

సామాన్యుల జీవితములను మైమరిపించుచున్నట్లు సెకండ్లు నిమిషముల చుట్టుమహోదాత్తమగు జీవితపు శుభదినము నాట్యము చేయుచున్నది. సామాన్యుల కడగండ్లు దూరమైనచో వదానందము తాండవించి నట్లుండును గదా!

ఒక తడవ ఒక పొలములో అతను ఒక తృణపూలిని (పొలములలో నుంచు గడ్డితో చేసిన మనిషి (దిష్టి) బొమ్మ) గాంచి మానవత్వము మరియు దాని కళను ఆకళింపు జేసుకొనెను. ఉదయసూర్యుడు సామాన్య మానవున్ని కీర్తించుచుండెను. ఎందుకనగా పక్షులు పంటను నష్టపరచకుండ కదలుచుండినవి. అది అతని ఉదయపునడక. అతను విశ్వమంతయు సామాన్యుని ఆధీనమై యున్నటుల దలంచెను. సామాన్యుడు నూతన ప్రపంచమునకు ప్రభువు. పక్షులు పూర్వపు నియంతలవలె యుండి యుండినవి. అతను రూప యొక్క మాటలు జ్ఞప్తికి తెచ్చుకొనెను.

# 10

బతుకమ్మ లేఖనందుకొని గతించిన కథను నెమరు వేసుకొనెను. తెలుగు వెన్నెలను కబళించినది రజాకార్ల దోపిడి. అకోలు కొవనిస్థితి రాణింపుకు వచ్చుచున్న సమయమది. శ్రీనివాసుని వెలుగు దాపు, తెలుగు తేజము మబ్బులదాపు రవివలె పొంగివట్లుండెను.

ఆ రోజు వీధిలో నొక సాధువు భిక్షాటము చేసుకొను చుండెను. భీమన్న అతని దివ్యత్వమునకు ఆశ్చర్య పడెను. వెంకటపురంలో నూత్నకాంతి ప్రసరించినట్లుండెను.

బతుకమ్మ యింటిలో వంటపనితో బాధపడుచుండెను. కూటికి గడవని గడుసురోజులవి. భీమన్నకు గల కొద్ది పొలములో ఏమి పండనందున అతనికి పొట్ట గడచుట కష్టమైపోయినది. నిర్జీవిగా బతుకమ్మ కృశించి పోయియుండెను.

“ భీమన్న గారు పొలంలో మాగిజొన్న పైరు వేద్దాం మీరు సరేనంటే ” అన్నాడు కాపు రంగయ్య.

“సరేనయ్యా ... అది మాత్రం చెడిపోయేదే ముంది. రెండేళ్ల కరువులో ఆ దినుసే కదా నాకు భుక్తిని సమకూర్చింది. ఏమో కాలము నమ్మరాకుండానే వుంది?”

ఇంతలో సాధువు భీమన్న యింటికి రానే వచ్చెను.

“ స్వామి వారికి మంచి మొక్కుబడి చెల్లించాలి సుమా! ... కష్టములు తొలగిపోగలవు.” అన్నాడుసాధువు. “ మీ యింట్లో బాగుచేయించాలి.”

భీమన్న అప్యాయంగా దోసెడు బియ్యము సాధువు జోలెలో పోశాడు. అరేండ్ల ఆనంద్ ఏడ్చుకుంటు బడినుండి పరుగెత్తుకొని వచ్చాడు.

“వేములవాడ వెళ్తున్నాను. శుభంకలుగుతుంది బాబు స్వామికి మీ పేర మొక్కు చెల్లించండి.” అనిసాధువు కొంత విభూదినిచ్చి వెడలిపోయెను.

“నాన్నా ... అంకిరెడ్డి కొడ్తున్నాడు. పుస్తకము చినిగి పోయింది.” అన్నాడు ఆనంద్.

భీమన్న వీధి బడి వరకు వెళ్ళి పిల్లవాన్ని సముదాయించి కూర్చోబెట్టి వచ్చి ఇంట్లో పని సవరించు కొనెను.

ఆ సంవత్సరము కూడా మామూలుగా మాగిజొన్నలు పండి కొంత లాభము కలిగింది.

ధైర్యం నిలద్రొక్కుకుని భీమన్న, భోగిరెడ్డిని కలిసి వచ్చాడు. అదే రోజు ఆయన హైదాబాద్ కు పనిమీద పోయివచ్చాడు.

" అయ్యా చూడండి కరువులో మీ జీతగాండ్రు జీతాలు, పంటలు పండని ఈ కాలము — నేనో ఉపాయంచెప్తాను. ఆ ఉన్న ఒక్కబావి వద్ద ద్రాక్షతోట వేయించండి. మరి నావిషయం కూడ శ్రద్ధవహిస్తే సరేసరి " విన్నవించు కొన్నాడు భీమన్న.

భోగిరెడ్డి పెదవివిరిచెను. " ఉన్న వాళ్ళనే తీసివేయాలని తలుస్తుంటే ఇంకా నీ విష యము కూడానా?

పీధిబడి కెమంగా పిం మాటాడు కొనుచున్న గొప్ప దనమును అనంద్ తిలకించెను. అంకిరెడ్డి ఆనంద్ లు ఎంతో స్నేహముగా యున్నట్టుగా పాఠములు వ్రాయుచు మాట్లాడు కొనిరి. కాని భోగిరెడ్డి కేదో విచారము మాత్రము పెల్లుబికి వచ్చుచుండెను. అది ఎవరును గ్రహించలేని స్థితిలోనుండిరి.

ఒక సంవత్సరము గడచిపోయినది.

ఆషాఢ మాసములో చెరువులు, కుంటలు నిండి పల్లెలు పైరు పచ్చలతో కళ కళ లాడుచుండెను. రంగయ్య కాపు మహదానందముతో భీమన్న పొలములో నాటు వేయించెను. లేని ఆనందముతో బతుకమ్మ బ్రతుకు సాగించెను. తీర్థయాత్రలనిన ఆవిడ కెంతో ప్రీతి.

శ్రావణ మాసములో ఒక ఆదివారము రోజు వారు వేములవాడ జేరిరి. భీమన్నకు ఆనంద్ మీద గల ప్రేమ గొప్పది. సాయంత్రము వరకు దేవాలయము, ఊరంతయు తిరిగిరి. ఆనంద్ కోరిన పిల్లనగ్రోవిని. బంతిని భీమన్న కొని యిప్పించెను. పోచమ్మగుడి భీమన్న గుళ్ళ దర్శించి ఆనందించిరి. ధర్మగుండమున స్నానమాచరించిరి.

భీమన్న అమితోత్సాహముతో వేములవాడ శ్రీ రాజ రాజేశ్వరుని దర్శించు కొనెను. బతుకమ్మ కనులలో మెరపు మెరసి నట్లయ్యెన ఆ దేవుని వైభవమును గాంచి తన్మయురాల య్యెను.

ఆ రోజు శ్రావణ సోమవారము. రాత్రి భజన జరుగు చుండెను. ఆ పాట వీనులవిందు గా నుండెను.

-: పాట :- (శివః శివా॥)

పల్లవి. : శివః శివా॥ భూత ప్రేత విదూరాః నమోః నమో॥
ఈః విశ్వపినుత కాంతిద్యుతివరా॥నమోః నమో॥

చలనము సత్తువ శక్తులనిచ్చి
తిలకించెదవే ఇలమము వచ్చి ॥శివ॥

సోమన్నవు భీమన్నవు మల్లన్నవు
రామన్నవు రాజన్నవొకడవె నీవు. ॥శివ॥

అన్నపూర్ణ మాయమ్మ గౌరిగను
అండరాజేశ్వరివి, నినుగొలుతును. ॥శివ॥

విరామయ లింగమయా! శంభో!
పరాత్పరా!.దయాకరా! ప్రభో!! ॥శివ॥

మా సత్తువపవి గానమేనెంచితివి
మరి విజయపటనమే చేయగనుంటివి. ॥శివ॥

పగుప మగవారల హక్కు సమతా
మహిమ చాటగలముక్తి ప్రదాతా! ॥శివ॥

బతుకమ్మ మనసులో దేవుని మహిమ, భక్తి మార్గము గుండ కన్పించుచున్నట్లు అనుభవింప దొడగెను. భీమన్న ఏడేళ్ళ కుమారుని నవ్వుచూచి మురసిపోయెను

మూడేండ్ల పిదప గొప్పమార్పు వచ్చెను.

భీమన్న జరిగిపోయిన పిదప మేనమామ సీనయ్యఎంతో సహాయము చేయాలని అనుకొన్నా బతుకమ్మ మాత్రం వెంకటపురంను విడువకనే ఆనంద్‌ను పెద్దవాన్ని జేసింది. పద్దెనిమిదేళ్ళ ఆనంద్ అమాయకముగానే పెరిగి ఆస్తిహీనుడై పోయెను. సీనయ్య వ్యగ్రామము చిలుపూరు.

ఆ కాలములో ఆంధ్రదేశము నుండి తెలంగాణములో భూములకొని స్థిరపడి పోయిరి తెలంగాణము నుండి ఆంధ్ర ప్రాంతమునకు పెక్కుమంది బ్రతుకుటకు పెళ్ళుటయు జరిగెను.

"అమ్మా! నేను కృష్ణానది కాల్వల క్రింద సాగుచేయబడు ప్రాంతములకు వెళ్ళి బ్రతుకుతానమ్మా" అన్నాడు ఆనంద్.

"ఆ దూరప్రాంతంలో మన తెలుగు దనపు ఆనందపు వెలుగులను పంచిరా నాయనా! నీకు శుభమగుగాక!" అని బతుకమ్మ అతనిని దీవించి సాగనంపెను. తనుచిలు పూరుకెళ్ళెను.

తొలుత అతను పంటికొండచేరి విజయపురిచేరినట్లు లేఖనంపెను.

# II

ప్రభాసు శ్రీ శైలమునందు గల ఒక దైవభక్తుడు. భూపేశ్ మరియు యితరులు అతని బంధువులు. అతను యింకా చాలామంది బంధువుల కలిగి యుండెను. ప్రభాసు పౌలపుయాజ మాన్య వృత్తి గలవాడు.

యాత్రి ముగిసిన పిదప కిరణ్ తనబంధువుల దర్శనార్థము వెడలెను. వీలుచిక్కిన పుడు ప్రభాసు గృహములో కొన్ని దినములు గడిపెను. అనంద్ కూడ అతని వెంట వెళ్ళుట తటస్థించెను.

ప్రభాసు శ్రీ శైలమున పెక్కుతడవల దేవాలయపు ధర్మకర్తగా అధికారపు బాధ్యత స్వీకరించి యుండెను.

సత్యవతి పరమ సుగుణవతి, ఈమె వాసు అనునతని పుత్రిక. ప్రభాసు గుణగణముల నెరింగినదై సత్యవతి అతనిపై ప్రేమగలదై యుండియుండెను. పరమదీనుడు వాసు. శ్రీ మల్లిఖార్జునుని వరప్రసాదముచే సత్యవతి జన్మించి తల్లిని కోల్పోయెను. దేవాలయ ప్రాంగణములోనే పెరిగి పెద్దయైన సత్యవతి ప్రభాసును పెండ్లాడునని వాసుతలచియుండ లేదు. భక్తి పరాయణుడై వాసు, దేవుని సన్నిధానములోనే కాలము వెళ్ళబుచ్చు చుండెను,

సత్యవతీ ప్రభాసులకు ఇద్దరు సింగిణి, శైలజ అనుపుత్రికలు కలిగిరి. కష్ట పరిస్థితుల రోజులు గడుచుచుండెను. బంధువులదయ వంశములో ఒక సమస్యయై పోయెను. కొందరు నియమిత ఆచారము గాదంచి నేరముగా వట్టిమార్పుతో సన్నిహితత్వము నెరపు చుండిరి.

సదుపాయము మాత్రము సంఘ పరిస్థితుల వాస్తవిక కళలను ఎదుర్కొనజాలదు. క్రమవికాసమగు నీతి సంప్రదాయము అకృత్రిమనాగరికతను అడ్డగించెను.

సింగిణి ఉత్తమురాలగు వనిత. చూచుటకు సన్నగా యుండినను అందము అడవిలో విగ విగ లాడెడిది.

ప్రభాసు అవిడపై అధికమైన గారాబమును కనబరచెడివాడు.

చాలా కాలము పిదప భూపేశ్, ప్రభాసును చూచుట తటస్థించెను.

ప్రభాసునిశ్శబ్ద ప్రశాంత వాతావరణంలో గదిలో యుండెను. అది డిశంబరు నెల.

భూపేష్ అనాగరికుడుగ ప్రవర్తించ లేదు. ప్రభాసు ఆశ్చర్యచకితు డయ్యెను.

ఏకాంతపు సదవకాశ ప్రదర్శన భూపేష్ మనస్సున ముద్రవైచు కొనెను. ప్రభాసు అతనికి నమస్కరించెను

భూపేష్ విచారము గలిగి యుండుటను మానెను. అతడు బలహీనుడు. గొప్ప ఆలోచనలు గలవాడు కాడు. ప్రభాసు ఎట్టి పరిస్థితిలోను ఆ ప్రకృతిని పసిగట్ట లేదు.

"రోజు లెట్లు గడుస్తున్నవి?" అని ప్రభాసు అడిగెను. "గోధ క్షేమమేనా?"

"ఆ... అవును."

భూపేష్ తన కష్టముల తలపోయుచుండెను. ఏకాంతపు టవకాశమును. భరింప లేకుండెను.

రెండు మూడు రోజులు గడచిపోయినవి. ఆ ప్రాంతపు వ్యవసాయ కూలీల పరిస్థితులు భూపేష్‌ను కలచి వైచినవి.

కూలి సిద్ధాంతములు బలహీనపు మతాంధ్వారా పతనమై పోవుచుండగా ప్రతి వ్యక్తి జీవిత మొక్క సమస్యమై పోయెను. ప్రతి యొకటియు భూపేష్ తన జీవిత కాలమున దురదృష్టకరముగా యనుభవించి బలవంతముచే ప్రోద్బలుడయ్యెను.

గొప్ప తిరుగుబాటు సంభవించి మానవ విధి పునః పరిశీలనల ననుకరించసాగెను. వాటిలో కొన్ని ప్రత్యేకమై విలుగలవై సామాన్యపు నూత్న ప్రకృతికి అనువైన వయ్యెను.

ఆ తిరుగుబాటులో కొన్ని సంఘ పరమైనవి యుండెను. భూపేష్ వాటిలో ఒక నీతి ద్యోతకము చేయుటకు బాధపడెను. తీవ్ర వ్యతిరేకతను అణగించి న్యాయరీత్యా నీతిని ఉన్నత స్థితికి నాగరికత స్థితికి తేబడుటయే ఆయత్నము.

భూపేష్ న్యాయప్రోద్బలమునే పెంపొందింప దలచెను. జీవిత సమస్యలలో పాలవు యాజమాన్యమే ఒక చర్చనీయాంశముగా సిరిసంపదల కాలావాలము కాకుండెను. ప్రతివ్యక్తి సుఖజీవనము అంశాంశము పరిగణింపబడెను.

కిరణ్ చాలాకాలము ఈ సదవకాశములను ప్రతిబింబింప జేసుకొనెను. యాజమాన్యమున అన్ని సదుపాయముల నెంచగలిగెను. ఉపాయములు ఆ పిదప ఆలోచనల కూపములో పూర్తిగా తగుల్కొనెను. అతను గ్రామోద్ధరణాధికారి (V.D.O) యయ్యెను. ఎన్నియో ప్రదేశములలో అతను ఉద్యోగమును నిర్వహించెను. గ్రామసీమల అందముల తీర్చిదిద్దుట అతని పనియయ్యెను.

సంఘములోని కొన్ని నియమములు తీర్మానావకాశమున ప్రతిపాదించబడక ప్రగతికి నీతిదాయక మగుపథమునకు మార్గదర్శకములు కాలేదు. ఉద్ధరణ అప్పు డప్పుడు పరిగ

ణింపబడెను. అదియు పలకనై పొందగు జీవితములు పరిగణింపబడినప్పటి నుండి ఒక స్థితికి వచ్చెను.

వాడవిషయ వాస్తవికతను గుర్తించనైరి. కాని సువర్ణపుపాల వలె తెల్లనికాంతి పరివర్తింప జేయబడిన సున్నము మరియు సిమెంటు వలె వాటి కష్టసాధ్యమైన పని సిరి సంపదలకు నెల వైన విషయము గుర్తింపబడెను.

నీటి బుడగలు ముందు తరము యొక్క చిహ్నములవలె సెలయేటి సంగీతమును ప్రోత్సహించినవి. ఏవిధముగా మనము తారాద్యగ్లోచనముల నర్థము జేసుకొందుము? ఏ విధముగా మనము గాలికదలికను అర్థము జేసుకొందుము?

విశ్వజనీనత అను సస్యమును మనము పండించ వలసియున్నది. ఏకత్వమనే పొలములోనే అది సాధ్యము. సామాన్యుడు పక్షులను తన యొక్క "తృణపూలి"చే భయపెట్టుట రాజకీయపు విశ్వమున అతని అధికారమైయున్న నీతిని తప్పింపజేయుచున్నది.

సురేశ్ వైద్యుడవుటకే కాలేదు. ఒక రోజు రమేశ్ భాగ్య నగరమునకు వెళ్ళి సురేష్ ఉద్యోగమును తిలకించెను. రమేశ్ ఆలోచనా సౌధము కూలి పోయెను ఏదోత్సప్తి కలిగిన వాడై తిరిగి విజయపురమునకు వెళ్ళెను.

కిరణ్ యొక్క అపారమైన గాత్రసౌందర్యము గురించి సురేష్ తెలుసుకొని ఆశ్చర్యచకితుడయ్యెను. ఏదో పర్వదినము రోజు సురేష్ మరియు కిరణ్ విజయపురంలో కలుసుకొనిరి.

సురేష్‌నకు ఏవోజ్ఞప్తి కొచ్చినట్లుండెను. అతని తల్లి బంధువులు నందిగొండలో కిశోర్ మామయగు ముకుంద్ పాలివారే. వారెవ్వరూ లేకుండా పోయిరి.

తల్లి ఆసుపత్రిలో వుండగా ముకుందే ఎంతో సేవచేసెను. అతనిలో బంధుమర్యాదలు ఉట్టిపడుచుండెను.

ముకుంద్ ఈ బాధలోనే తన భృత్యుడైన మీనయ్య కంటిరోగము నయముజేయించుటకు ఆసుపత్రికి తీసుకెళ్ళెను. అజాగ్రత్త, లేమి, వల్ల మీనయ్య ఒక కన్నుకోల్పోయెను.

"పేదవారికి ప్రసాదించే స్వేచ్ఛా, ప్రజా స్వామ్యములలో ఒకటి కోల్పోయినాను. ముకుంద్‌గారి ప్రసాదమిది." అన్నాడు మీనయ్య.

ముకుంద్‌నకు కలిగిన బాధకు సురేష్ ఆరాటమునకు మేరలేకుండెను.

# 12

ఆ రోజు పొద్దుననే శ్రీ శైలమల్లికార్జున స్వామి దర్శనార్థము అనేక మంది భక్తులు వేచి యుండిరి. అహంభావముతో విర్రవీగిన వెంకటాపురం సంస్థానాధిపతి భోగిరెడ్డి అప్పుడే దైవదర్శనార్థము వచ్చుచుండెను. ఆనంద్‌కు ఆ విషయము తెలిసివచ్చింది. మందిని త్రోసుకొని కిరణ్‌ను ఒక వైపునెట్టి కదలుతున్న అతనివాలకము ప్రభాసునకు నచ్చలేదు.

"ఎవరు నువ్వు? ఆగు!" అని గద్దించాడు ప్రభాసు.

భోగిరెడ్డి చిన్నబోయిన మనస్సుతో చూడసాగెను. వారివెంట ఆనంద్‌ను గాంచి విస్మయుడాయెను.

రెడ్డికి గతించిన విషయము జ్ఞప్తికి వచ్చింది. అప్పుడు ఆనంద్ పుట్టలేదు. అమాయకముగ పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న భీమన్నను ఏదో నెపము మిద తన దగ్గర యాజమాన్య పర్యవేక్షకుని పని నుండి తొలగించెను.

భీమన్నకు బతుకమ్మతో వివాహము జరిగినది. ఉత్తమురాలైన యిల్లాలు బతుకమ్మ అందచందాలకు ముగ్ధుడై ఆమెను చెరబాలని ఊహించిన దుష్టఘడియకు ప్రతీకారమని భోగిరెడ్డి తెలుసుకొన్నాడు

హరిజనుడైనా అధికుడైనా దేవుని బొమ్మలే. నీతి నిజాయితికి ప్రతిరూపము కాని గొప్పజాతి సౌందర్యమేపాటిది? ప్రతిభతో గూడిన చిన్ని తరగతి మనిషి విలువ యెంతయో గొప్పది. దేవుడు నిజముగా తనమాయతో నిర్మించిన సృష్టిలో తెలియరాని రహస్యమిదియే.

పవిత్ర హృదయులకు జన్మించిన ఆనంద్‌కీ విషయము తెలియదు. రెడ్డి ఇంకాతల పోసుకొనెను.

అదిమిట్ట మధ్యాహ్నము వేళ. సోమవారము. దాసిభాగ్యమ్మ రెడ్డి అభిప్రాయముల తెరంగుతో వెంటనే బతుకమ్మ సౌధమునకు రామొదలిడుట భీమన్న ఏదో కార్యము మీద వెళ్ళడము ఆ పాపంలాంటి చీకటిని హతమార్చిన ప్రభారూపశీలుడే ఆనంద్.

"నేడు మనము హాయిగా రమణమ్మ గారితో కులాసా కబుర్లు చెప్పుకొందాము పదవే బతుకమ్మా!" అని భాగ్యమ్మ అన్నది.

బతుకమ్మ అమాయకురాలు. పవిత్రక భవనం లోనికి ఎలాగో పోయింది. తన పాచిక పారిన భాగ్యమ్మకు సంతోషం కలిగింది. భోగిరెడ్డి ఆనందానికిమేర లేకుండెను. భాగ్యమ్మ

బతుకమ్మ యిద్దరు ఒకగదిలో కూర్చొని యుండిరి. అదివరకే కొన్ని సరంజామాలు సమకూర్చబడి యుండెను.

"రమణమ్మ గారిప్పుడే వస్తారునుమీ," అనుచు భాగ్యమ్మ అక్కడినుండి తప్పించుకొదలచెను. "నేను మళ్ళీ వస్తాను"!.

"కూచో బతుకమ్మా! ఏం భయం?" అంటు భోగిరెడ్డి గదిలోకి ప్రవేశించెను. బతుకమ్మ ధైర్యంగానే కూచొని యుండెను. కాని "ఎంత అందంగా వున్నావమ్మా!" అనిముఖమును చేర్తోపట్టుకొని తన ముఖంవైపు త్రిప్పువంతలోనే బతుకమ్మ భయంతో బయటకు పరుగెత్తుకొని పోయెను.

రెండేళ్ళలో కష్టాలపాలు అయినవారి సంసారం క్షీణించి పోయిన చంద్రరేఖ అయింది నెపము తెలియక భీమన్న ఉద్యోగము పోయి నిస్సహాయుడై ఎలాగో బ్రతుకు చున్న కాలం అది.

మూడవ ఏట ఆనంద్ జన్మించినాడు.

దాదాపు పదేళ్ళ కష్టపు బ్రతుకు గడిపి, తనవు చాలించిన భీమన్న ఆనంద్‌ను పెద్ద వాన్ని చేయలేక పోయాడు,

స్త్రీ పురుషులకు స్నేహము పవిత్రమైన దగ్గరి సంస్కారమువలె మెరవాలి. అపవిత్రమైన చీకటి మార్గం వారికి ఆధారముకావడము మంచిది కాదు. ఉత్తమ శీలునికి హరిజన కుల ప్రసక్తితో దాపురించిన జన్మ సార్థకమైనదే. కాని ఉత్తమ కులమున అశ్లీలుని జన్మ సార్థకమగుట అసాధ్యము.

పాపం చీకటి వలెనే బెదిరి పోయింది.

కిరణ్ జీవితము నందును మార్పు సంభవించెను. విజయపురికి సమీపమున రెండు మూడు గ్రామములు మాత్రమే అతను పర్యవేక్షించు చుండెను. ఉద్యోగము సౌకర్యవంతమై మెప్పినది. ఇంటి వద్ద నేయుండి పనులు చక్కబెట్టు కొనుచుండెను.

ప్రభానునకు కిరణ్ బ్రతుకు నందు ఆశాకిరణము ఉదయించి నటుల కన్పించెను. అనాది నుండి మానవత్వము ఆకలి బాధల తొలగించు ఉపాయము సాగించుచునే యున్నది. కిరణ్ బ్రతుకు ఉదయ భానునివలె ప్రకాశించు చున్నటుల ప్రభాసు యోచించెను.

దైవదర్శ నానంతరము వారు ఆనంద్‌తో సహా స్వగృహమునకు వెళ్ళిరి. అచ్చటి వారందరును ఆనంద్‌ను ఎంతో ఆదరించిరి. ఆనంద్ వారి ఆధరాభిమానములను మనసులో తలచుకొనుచు, ఏకాంతముగా నున్నపుడు కూనిరాగాములతో గడిపెను.

# 13

రమేశ్ తన మార్గము యొక్క వాస్తవికతను ప్రతిబింబింపజేయ యత్నించెను. కొన్ని తరవాత స్వంత వివాదములు కోట్లాటలు జరిగినవి. భూపేశ్ యిట్టి వారసత్వమునకు గురికాలేదు.

కిరణ్ పరిస్థితిని ఒక అంచు వరకు అదుపులో వుంచ లేకుండెను. రైతులకు సలహాలు యిచ్చుటలోని బాధలనే విసిగెడివాడు.

ఇదే సమయమున సురేష్ తన ఉత్సాహముతో కూడిన ప్రత్యుత్తరము నీయ లేకుండెను స్వయముగా తన నడవడి బ్రతుకు మీదనే అతనికి దయ లేకుండెను. వారెన్నడు ముదముజెందలేదు.

అనువులేని అత్యవసరములకై తగవులాటలు వారసత్వమున తిరుగు లేనివై పోయినవి. భూపేష్ కూడ సురేష్ పొలము మరియు పశువుల గురించి తగవు లాడగ రమేశ్ నకు ఆశ్చర్యము కలిగెను. రమేశ్, భూపేశ్ మధ్యన మొదలయిన తగవువలన గోధ మరియు సరళ మాట్లాడు కొనకుండిరి. పొరుగువారి మధ్య అదియొక విషమ సమస్య అయినది.

రమేశ్ పొరుగు వనములోని నిజాయితీపరుడు. అతి వినయము నతడు భరించ లేకుండెను. కిరణ్ పొరుగింటిదనము లోని సంకుచితత్వమును అసహ్యించుకొని విషాద గ్రస్తుడయ్యెను.

సంఘ ప్రతిబింబములోని నియమబద్ధమైన వ్యష్టికుటుంబ నియమావళి ఆశించదగినదై యుండెను.

స్వంత లాభము కొరకు ఎవరు అన్ని విషయములను వీలునుబట్టి పట్టించు కొనలేరు? కాని కిరణ్ అభిప్రాయములోని సమిష్టిదనమును కాంక్షించిన రమేశ్ యదార్థమును తెలుసు కొనలేక చింతించెను.

"సురేశ్‌నకు సగము ఆస్తి రావలసినదే!" కిరణ్, భూపేశ్‌ల యొక్క వాదన అది.

"నేను పెంచి చేసిన సురేశ్ స్వయంగా బ్రతుకు చున్నాడు. ఆస్తి అతనికి లేకున్నా సరే!"— అని రమేశ్ వాదన.

సురేశ్ వారి వాదనలోని యదార్థముల గ్రహించి "తీర్పును సంఘపరంగా తిరస్కరించలేము సంజాయిషీ మన వంతు." అని వారిని సముదాయించెను.

జీవిత ప్రధానము భవితకల చిహ్నముల మెచ్చుకొని కిరణ్ అప్పటి కప్పుడే అన్ని సమస్యలను శోధిసిపుచ్చెను. సురేశ్ ఔదార్యమువకు ఎంతో సంతసించెను.

వెను వెంటనే నాగరికత ఉన్నత బిందువును. జేరెను బహుశః తలచినవారికి ప్రజాపీ కములో అదిపెద్ద అభిప్రాయమై యుండవచ్చును. కేవలం ప్రతీకలు అనుకరించు దశను జీత గాండ్రకు చెప్పుట కేమి సమయము చిక్కలేదు. అది బాధాకరమైన విషయము వలె కిరణ్ న్యాయరీత్యాతలవగా నిజముగా అది కఠిన ప్రకృతమై భవిష్యత్తులో ఆదర్శమునకు విచారిం చవలసిన దయ్యెను. రమేశ్ అట్టి అభిప్రాయముల నెన్నడు తలవ లేదు.

ఇతరుల విషయములలో నీతిని ప్రదర్శించుటకు వాస్తవికముగా తికమక పెట్టుటకు సోమరివలె కిరణ్ ధైర్యము జెంది ఎదుర్కొనెను. ప్రకృతి సిద్ధముగా కిరణ్ కొన్ని విషయ ములను నాగరికతకై ప్రతిపాదించగా దయగలవారు కొందరు వ్యతిరేక మనస్కులు కాకుండిరి.

ఇవి యంతయు స్వానుకూలమై ప్రతీకారమువలె దేనికో నియమబద్ధమై యుండెను.

శాంతి సాధనలు ఏదో విధముగా తమలో నీతినికన్పట్ట జాలినను చాల మంది గుస గుస లాడుచుండు వారివలె గోడచాటున పొంచిన శాంతి కాంతిని వారు పొందలేరైరి. తృప్తిక రముగా ఒక విషయము విచారించ వలసినదైనను నేరము దృష్ట్యా చెప్పుకొనుటవరకే పరిమి తమై యుండెను. ఏలనవగా అసహ్యత మూలమున కిరణ్ సౌఖ్యమును వీడి ఒంటరి తనమున తికమకలతో సతమత మయ్యెను. నాగరికతలోని కలతలు శాంతించలేదు. సరికదా నీతియైన నియమబద్ధమైన సిద్ధాంతములను జీవితమునకు చెప్పియుండ వలసినట్లుగా రచించబడ లేదు. సామాన్యుల కడగండ్లతో అతను పోరాడెను.

వీలయిన కార్యము నిజముగా గుసగుసలాడి బాధపెట్టినను నిజముగా దోచినపుడు దానిని కిరణ్ శ్వాసించెను.

దయాపరము అణచ బడిన న్యాయము అధఃపదమున గుసగుసలాడుట కిరణ్ యోచించ గలిగెను.

కిరణ్ యొక్కడే నిది ప్రవచించ గలిగినను అదినిన్నత్తువ గలదై యున్నటుల సకల జనప్రియ దాయకమగు దారిని కాంక్షించుచున్నటుల నుండెను. అతనిలో జీవితము ప్రారంభ మైనది. అతడు యవ్వనుడాయెను. జీవిత సౌందర్యము లావణ్యమును ప్రేమించెను. జీవిత మెట్లుండెనను విషయము కిరణ్ పట్టించుకొన లేదు.

సుడిగాలి వీయడము మొదలుపెట్టెను. అది దసరా పండుగ. దూళి గాలిలో ఎగుర

లేనంతగా భూమి అణగిపోయిన చలికాలము కావున చెట్లు మాత్రము రుంయ్యమని ఊగు చుండెను.

దసరా కన్నముందు ఎనిమిది దినములు దుర్గాష్టమి నాడు కొనుటకు సికతని వెడలెను. పెనుగాలి భీభత్సము మామూలుగా ఎనిమిది దినములు వచునగా యుండెను. చివరిరోజు బతు కమ్మ ను చెరువులో వదలి యింటి ముఖంపట్టుటకు సికతని ఉద్యుక్తురాలయ్యెను. అది ప్రళ యరాత్రి వలె నుండెను. తుపాను చీకటి చెలరేగెను.

ఒక దీపము యింటిలో మిణుకు మిణుకు మనుచుండెను. గగననీలాంబరముల పొరల పొరలతో సంధ్యా సమయమున చాకలివారి వలె తారకలు యింట్లకు పోయినట్లుగా కొన్ని మెర యుచుండెను.

# 14

సింగిణి, నాగరికత యొక్క లక్షణముల తెలుసుకొన మొదలిడెను. కొన్ని తడవల సత్యవతి తన సోమరితనమును, అసంతృప్తిని గురించి పరీక్షించు కొనెను. ఒంటరి తనము ఆవిడలో నిర్జీత దశకు అలవాటు పడియుండెను.

ప్రభాసు ఎప్పుడును ఆ అలవాటునకు బద్ధుడు కాలేదు. నాగరికత లతవంటిదని సింగిణి యభిప్రాయమై యుండెను. తనను ఒకరు కాంక్షించుటగాని వలచుటగాని తప్పనిసరి అయిన ప్పటికి కిరణ్ అభిప్రాయమేమై యుండెనో యని సింగిణి తలచుచుండెను. సింగిణిని ప్రేమిం చిన కిరణ్‌నకు ఒంటరి తనము వరిసి యుండుట నెప్పుడును మరచిపోలేదు.

భూపేశ్ వృద్ధుడై పోయెను. ఈదశలలో అతనికి తృప్తిలభించి యుడలేదు.

చాలా కాలము పిదప సురేశ్ విజయనగరము వచ్చినపుడు కిరణ్, రమేశ్‌లను చూచు టలో ఆనందము జెందెను. వినయప్రేమ వారిలో పోత పూయబడి యుండెను. సురేశ్‌దా నిని పరిశీలింప జాలకపోయెను.

అతను విజయపురము లోని సమన్యల వల్ల ఆశ్చర్యపడినను ఎప్పుడును సికతనిని ఆవిడ శ్రేయస్సును మరచియుండ లేదు. కిశోర్‌ను మాత్రము ఎందుకో తలచిన వాడు కాదు. తనగురించి జరిగిన వివాదములను తెలుసుకొను కుతూహలము కలిగినను సురేశ్ ఎవరిని మాత్రము నిందించలేదు.

సికతని గురించి తెలుసుకొనుట అతనికి లజ్జాకరమై పోయినది. రమేశ్ నకు కూడ నూతన మార్పుల వలన తృప్తికలుగ లేదు. కిరణ్ యోచించబడ వలసిన వానిని లెక్క చేయలేదు. అందువలన తన ప్రసక్తిని తానే మలుపుకొన నమకట్టెను.

సికతని స్వేచ్ఛాజీవిగా ఒవరిని కరుణించ లేదు.

రమేశ్ అప్పుడప్పుడు కాలపు గంటలచే పిలువబడిన వానివలెతలచుచు నిష్ప్రయోజనమైన మార్గమును గాంచుచు నిరుత్సాహవంతుడై యుండెను.

ఇది యంతయు సురేష్‌నకు గగుర్పాటు వలెయుండెను. సరళ యెన్నడును అసంతృప్తి జెందలేదు. ఇట్టి సదవకాశము అతనికి కలుగ లేదు. కాలము బయట డాగి పోయినది.

ప్రీతి విషయము సరిహద్దువలె నియమింపబడెను. విధి తవంటట తాను అధః పధము వరకు అడిపోయెను.

కిరణ్ పొలము పని కార్య కలాపముల యాజమాన్యత గురించి నిశ్చయించలేకుండెను. అట్టి తికమకలు ప్రకృతి సిద్ధముగా వ్యధలయ్యెను. యాజమాన్యత పునః పరిశీలనాత్మకమై యుండగా సహాయ జన్యక మగు విషయము అతనికి తృప్తిని కలిగించ. లేదు కిరణ్ అటులనే దానిని విసర్జించెను.

భూపేశ్ అవిషయములలో ఫలవంతమైన సదుపాయములను పొందు సమంజమగు స్థితిని యెంచుకొనెను. అతను కిరన్ వివాహ విషయముచే భరింపరాని బాధ ననుభవించెను. అతని తనువే ఘడియను నమ్మరాని స్థితిలో యుండెను.

ఒకనాడు ప్రభాను ఒప్పిదముపై కిరన్ యొక్క వివాహమునకు భూపేశ్ సమ్మతించెను.

కిరన్ యొక్క వరపూజ జరుపబడెను. అనుయమున ప్రభాను సువర్ణ పుటుంగరమును ఆనవాలుగా ఒప్పిదమునకు సూచనగా సమర్పించెను.

సురేష్ మొత్తముమీద నీ విషయము నెరిగెను. అదియొక విషమ విషయము వలెయుండెను. ఒక నెల పాటు చరణదాసు అతనిని అమెరికా లోని అంతర్జాతీయ వాణిజ్య సమావేశమునకు పంపించెను. అతను అమెరికాలో ఏవిధముగా యున్నది తెలియుట కష్టమైపోయెను.

"మీది మెరుగుల విదేశీయత నెలాగు కాంక్షించ లేక పోయితిని" సురేశ్ అనెను.

రూపనవ్వినది. "విషపు నవ్వు లితరదేశీయులవి అసలు నవ్వులు మనవి." అనియు పేర్కొనినది రూప మనసు మాత్రం.

మొత్తము మీద కొన్ని నిర్ణయములే విధముగను ఫలవంతమగు విజయము సాధించలేనివై పోయినవి. సురేశ్ తన జీవితము గురించియే ఆలోచించెను. తన భవిష్యత్తును తెలుప లేకుండెను.

నిర్దయపు వాస్తవికతలో సురేష్కు ఎట్టి చెడు అభిప్రాయములు మాత్రము లేకుండెను. అతని మనసులో కిరణ్ సురేష్ మరియు కిశోర్‌ల గురించి తలపోసెను. అతను విధి చేత కనికరింపబడెను. అంతకు మించిన దాని నతనేమియు తలవలేదు.

అర్ధ రంగముల చిలిపి తనాన్ని తొలగించు వెలుగు యొక్క అవశ్యకత నెరిగినవాడై యుండ, కిరణ్ దీపమునకు ప్రాణమిల్లెను వెలుతురు యొక్క అత్యుత్తమ శక్తిని మనములో నెంచు కొనినవాడై అతను తన్మయత్వము జెందెను. దీపము తైల దాయమును కోరినట్లు వ్యయపు చీకటిని విడిచినట్లు సిరిసౌఖ్య ప్రదాయినియై ప్రకాశింప జొచ్చెను.

సిరి సంపదలు సౌఖ్య ప్రదములు. అవి వీధి దీపముల వలె ప్రపంచమును తిలకించును ఇతర జగత్తును వీక్షించుటయే వారి కర్తవ్యముల పర్యవేక్షించుటయే వాటిపని.

సురేష్ భావనాశక్తిని సంపాదించుకొన లేక పోయెను.

ప్రొద్దస్తమానములు చీకటినల్ల దనమును శుభ్రము చేయుటకై సిరి సంపదల మధ్య నియమింపబడిన వేమోయను నట్లున్నవి.

# 15

సికతని ఎప్పుడును పొలములో పని చేయుచుండెడిది. ఇతరులపై జీతగాండ్రపై పశువులపై దయగన బరచెడిది. గల అభిమానము ఆవిడపై రమేశ్‌నకు కొద్ది తన యాజమాన్యమును ఆవిడకు తెలుపుచుండెను తన బాల్యావస్థ నుండి ప్రకృతి పై పరీత్యము స్మరించుట కలవాటు పడియుండ లేదు సికతని.

ప్రతి ఒకరు ఆవిడ ఉదారత్వమును గని విచారించెడి వారు. రమేశ్ ఆవిడ ఔదార్యమును తెలుపుచు ఆవిడ నిర్ణీత స్థితిని అర్థము జేసుకొనుట సత్యదూరము కాదని నుడువుచుండెను. ఆవిడ అతని మాటలచే వాస్తవమును తెలుసుకొన వలయునని ప్రయత్నించినను తన నడవడిని తానే నమ్మలేని స్థితిలో యుండెను.

ఆవిడ దినమందు చాలసేపు పొలములో పని చేయు చుండెడిది. ఒక్కొక్కప్పుడు నిద్రించెడిది కాదు. సతతము విశ్రాంతి యనునది అవకాశ మాత్రమైన ఊహాగా ఆవిడకు యుండెడిది.

కష్టమైన పని వున్నంత వరకు ఎప్పుడును ఆవిడకు చులకనగా కన్పించెడిది కాదు. బాధకన్న యేమి అధికమైన అవకాశము లేకుండెను. దురదృష్టము ఆవిడను వెంటాడెను.

ఎట్టి వడవడికైనను ఆవిడ కృతజ్ఞురాలుగ నడచుకొను చుండెను. ఆవిడ పనిని తలవో యనిచే విశ్రాంతి గైకొనకుండెడిది.

రమేశ్ స్వయముగా విచారించుటలో నిష్ప్రయోజకుడై పోయెడివాడు. ఎప్పుడును జీవితములో అలసటచే విశ్రాంతి పొందలేదు. సరళకూడ సికతని గురించి బాధపడలేదు.

రోజులు నిర్ణీత పరిస్థితులచే పెన వేసుకొను స్థితికిరాగా రమేశ్, కిశోర్ గురించి ఎట్టి ఆలోచనలు చేయలేదు.

ఒకనాడు సరళ ప్రశాంతముగా యింటిలో పని జేసుకొను చుండెను. కిశోర్ తన సోమరి తనము మూలముగా అయిష్టుడై నిరుత్సాహము జెందెను.

"నేనీబాధను ప్రేమించలేను." సికతని తల్లియగు సరళతో నుడివెను.

కిశోర్‌కు అట్టి అభిప్రాయములు కలుగ లేదు. మరి సికతనికి తనపై దయలేకుండగా తన తండ్రిని నిర్దాక్షిణ్యముగా జూచెడిది.

రమేశ్, సికతని కొరకు మంచి ఉత్తముమైన మర్యాదస్తుడగు పతిని వెతకనారంభించెను.

"ఈ బిడ్డకంటె అధికముగా యేమిలేదు." సరళ, సికతనితో యనెను.

"లేదమ్మా! నేను భవిష్యత్తులో విషయముల వెదక నారంభించనున్నానమ్మా. ఇది కేవలము మూలమైన యాజమాన్యత, మరియు కష్టముల మూలము. నేను ఉత్తమమైన అదృష్టమును భవిష్యత్తును జూడగలను.

సరళ ఆశ్చర్య చకితురాలయ్యెను.

రమేశ్ యిదియంతయు వినెను. కదలికలేని ఆలోచనతో తిరుగెడి ప్రేరణలచే చెవిటి వాడు కాకుండ అవి గుస గుసలనెడి భ్రమజెందక తలవోసెను. దాని నేమాత్రము యోచించ లేదు.

ఒక రోజున కుమార్ పొలములో యుండెను. రమేశ్ అప్పుడె అక్కడికి వచ్చి పనిని తిలకించు చుండెను.

"నమస్కారము బావగారూ!" అన్నాడు ముకుంద్.

ఎదురుగా వస్తున్న ముకుంద్‌ను జూచి రమేశ్ సంతోషించెను. "నమస్కారము.... సరేకాని నీరాకే బంగారమై పోయినట్టుందేం?" అని రమేశ్ బదులు పలికెను.

మూడునాలుగు రోజుల పిదప తిరిగి పోదలచిన ముకుంద్ తనఊరు వెళ్ళలేక పోయెను.

ఆశ్లేష కార్తెలో ముసుర్లు పడినవి. ఆముసుర్లలో తిరిగిన రమేశ్ అనారోగ్యముచే బాధ పడెను జ్వరము తీవ్రమైపోయెను.

"కొన్ని రోజులుండి పోవయ్యా! కిశోర్ అమాయకుడు అన్నాడు" రమేశ్, ముకుంద్ తో జ్వరముచే బాధపడుచు, "వ్యవసాయపు పనులు బాగా దెబ్బతినకలవు సుమా!"

భూపేశ్ మరియు కిరణ్ కలసి సురేశ్ యొక్క భాగమును ఆస్తినుండి పంచియిప్పించిరి. రమేశ్ నకు మనోవ్యధ మొదలయ్యెను. సురేశ్ నకు ఈ ఆస్తిని స్వయంగా ఒకరిపరంగా సేద్యము చేయించుట ప్రత్యేకమైన పనిఅయ్యెను.

"నీవు ఎందుకు విడిచి పెట్టినావు? అంతమంచిపాలు." అన్నాడు ముకుంద్ రమేశ్ తో. "అందరికి అన్ని విధములయుంటే నీకేమి లేదాయె"

రమేశ్ అన్నాడు. "కావలసినదేదో కాకమానదు. నాకు దక్కినదే నాభాగము."

ముకుంద్ ఔదార్యమునుజూచి కూలీలు సంత సించెడివారు. పెంటాజి, చందు, స్వయంగా పనిలో చేరుచు కుమార్ కూలీలను కూర్చగా అమితోత్సాహముతో ముకుంద్ యాజమాన్యముచేయగా పొలము పనులను నడిపించిరి.

యాజమాన్యము ప్రొద్దస్తమానము అందు అధికారమువలె జెప్పబడగా దాని కెక్కడలేని శక్తి ప్రకాశము కలిగి నట్లుండెను. కొన్ని మార్గములు స్వయంక్రియాత్మకములై యుండగా అవి నీతివంతములై భాగస్వాములవలె వెలుగ యత్నించుచు అధికారుల యొక్క రహస్యముల బట్టబయలు చేసిపెట్టుండెడివి, కొన్నిక్లిష్టముగా తోచెడివి.

అప్పటి కప్పుడె యంత్రాంగమైన పని, ప్రజలలో పరిశోధనాత్మక స్థితికి దారి తీసినది.

వారెప్పుడును పని చేయుచుండిరి. కూలీల సంక్షేమ పోరాటము సాగినది. దేశీయయాజమాన్యతలో ఆశరాన్యతమెరుగై పనిచేత ప్రగతి బలవంతముగా తీర్చిదిద్దబడు చుండెను.

విద్యాప్రసక్తి యొక ఉత్తమదశను నిరూపించుచుండగా అట్టి ప్రోద్బలము నందరును ప్రేమించుచుండిరి.

పరస్పర వాణిజ్య సంస్థలు సహకార రంగమున యిట్టి తీవ్రమైన కార్యక్రమములను అనుకరించినవి. ప్రభుత్వమిట్టి కార్యక్రమముల విర్వర్తించుటచే చాలమేలు కలిగెను. గ్రామ సేవకుల పలుత్రోవలలో ప్రగతిని తీర్చిదిద్దు చుండిరి.

ప్రకృతి సిద్ధముగా ప్రతి బింబింప బడిన మనస్సులతో ప్రతి వాడును ఆకర్షింపబడు చుడెను.

ముకుంద్ కొన్ని దినములుండి, పనులుచేయించి వెళ్ళిపోయెను.

ముకుంద్ స్వగ్రామమునకు పోయిన పిదప పనులు కొన్ని చక్కబరచు కొనెను. భార్య దుర్గ పాపం కిశోర్ మరియు సితలని క్షేమమునడిగెను. ముకుంద్ సమాధానముచే నామె సంతసించెను.

. రమేశ్ ఆసంవత్సరమే క్రొత్తగా సర్పంచుగా ఎన్నిక అయ్యెను. కూలీలలో మంచి అభిమానము పొడచూపెను. ఈవార్త దుర్గతో చెప్పుటకు ముకుంద్ ఎంతగానో ఆనందించెను.

అప్పటివరకే బహాయి అను మతసంస్థ పనిచేయడము మొదలు పెట్టెను. కొందరు ఆ సంస్థ సభ్యులు ఆంధ్ర ప్రదేశమునందు పర్యటించి సభ్యులుగా చేర్చుకొన మొదలిడిరి.

రమేశ్ ఆదరాభిమానముల మూలముగా పాఠశాలలోని కొందరు ఉపాధ్యాయులు మరియు కొంతమంది గ్రామీణులు ఆసంస్థ ప్రతినిధులుగా జేరిరి. మిట్టపల్లముల చదనుచేసు కొని క్రొత్తపొలము చేయు నూతనసంఘమున వర్ణాంతర వివాహమున మెచ్చిహరిజనోద్ధరణ చేయుచు రమేశ్ ఎంతో మంచి పేరును సంపాదించు కొనెను. పల్లెజలకు అపద్బాంధవుని వలె కన్పించిన రమేశ్‌లో రాజకీయ మూలాతత్త్వముచోటు చేసుకొన వందన జనతా బంధువని పెక్కుమంది అతనిని కీర్తించిరి.

# 16

ముకుంద్ తిరిగి విజయపురి వచ్చునరికి చేలపై పక్షులువాల్లి సస్యనష్టము చేయుచుం డెను. సరళ ముకుంద్ గురించి తలంచకుండెను. ఆవిడ అతనిని కనికరించుచుండెను.

నిజముగా ముకుంద్ జీతగాండ్రి ప్రేమను చూరగొనెను. అతను వారికి ప్రేమ పాత్రుడై యుండెను.

పెంటాజి ఒక గడ్డితో చేయబడిన మనిషి బొమ్మను తయారుజేసి పంటను కాపాడుటకై చేను మధ్య భాగములో యుంచెను. ఇతరులు కులపరమైన భావనల చూపలేదు: ఎందుకనగా దాని వస్త్రధారణము గురించి వారాలో చించరైరి. తుట్టతుదకు దానితలపై ఒక ఆంగ్లేయ టోపీని అలంకరించిరి. అందరు కలిసి దానిని జూచుచునవ్విరి.

ముకుంద్ సంఘమును గురించి యెప్పుడు ఆలోచించి యుండెనమట చెప్పరానిది. కిశోర్ ఎప్పుడును అతనిని కనికరించ లేదు. అందువలననే ముకుంద్ లేని సంతోషమును

కనబరచెడి వాడు. ప్రజలు చెడ్డ పరిస్థితులతో బాధ పడుచుండిరి. ముకుంద్ వాటిని చాలవరకు విర్శ్యాలించెను. అతనికి సంఘ సంస్కారమునందు గొప్పదృష్టి యుండియుండెను. జీవిత సమస్యలు యివివరకు తలవనంత పెద్దగాయుండెను. అతని కెప్పుడును అయోమయముగా యుండెడిని. అటను తీర్మానములవిధిని కనికరించు చుండెను. మానవత్వములోని అనిశ్చిత నిరాశాపూరిత మగు సంపాదన నతని కుర్రింగదీసి చింతింపజేసెను. అసాధ్యమగు సమస్యలే అతని వల్లుచీకాకు పరచినవి. వాటి పరిష్కారము కష్టమైపోయెను, సరళ, రమేశ్‌ల తీర్మానముల నతడు పాటించెను.

మానవ ప్రకృతి విర్జితమగు దుఃఖమును అదుపులోయుంచ గలుగును. సికతని గురించి సలహాయిచ్చి విఫలమొందనెంచలేదు ముకుంద్.

రాత్రింబగళ్ళు మనస్సులను మార్చినట్లుగా యజమాన్యం కష్టసుఖముల ప్రసాదించు చున్నది. కిశోర్ అట్టి వాస్తవికత నిర్ణయంగ్గె కొన సంసిద్ధుడు కాలేదు.

ముకుంద్ దానిగురించి వ్యథజెందెను. స్వయముగా నతనికి దానిని నిర్ణయించుటయు, కష్టమో, ఫలమో చెప్పుకొనుటకు వీలైనది కాకుండెను.

"ఎక్కడ శక్తి పండింపబడు చున్నది?" తన ఆలోచనతో ముకుంద్ సతమత మగు చుండెను. అతను ఆశ్చర్యమనస్కుడాయెను.

కొన్నిదినముల పిదప సరళ, ముకుంద్ గురించి, కుమార్‌ను ప్రశ్నించెను. "అతను యింటి వాడివలె నున్నాడా?"

"వ్యవహారములే యున్నవి. యాజమాన్యపు సమయమున అణుశక్తివలె అతనుసూత్న విషయమును సూచించును" కుమార నెను "చౌకగావున్న గొప్పశక్తి అతను"

"సికతని భవిష్యత్తు ఏమి?" సరళ, ముకుంద్ నడిగెను.

ముకుంద్ ఆలోచించుటకు నిష్ప్రయోజకు డయ్యెను. నవ్వెను,

ఎప్పుడును ముకుంద్ సాంఘిక వాస్తవికత యంశములచే మగ్ధుడుకాలేదు. అతను మానవత్వమును దానిశక్తిని గని కనికరము జూపుచుండెను, ఆతీర్మానము జరుగుట యెందు కనగా జీవితము పరమాణువుల గతిని స్మరించుటకు వెలితిగా సిద్ధమయ్యెను. ముకుంద్ అన ధికారము నెరిగి సరళ మిన్నకుండెను.

కిశోర్, మరియు సికతని యొక్క వివాహములు జరుపబడ వలయునని రమేశ్ బాధ పడుచుండెను. సికతని యుక్తవయస్కురాలయ్యెను. ఇంకను ఆవిడలో బయట పనిచేయు ఉబలాటము మాన్పబడ కుండెను.

సతతము కష్టములే చిన్న చిన్న చరిత్రలను కట్టిపెట్టినవి. క్రమముగా సికతని ఎప్పటికి కష్టించి పనిచేసెను. ఎండ వానకాలము లావిడను వెంబడించినవి.

సంగీత ప్రాధాన్యముగల జానపద ప్రదర్శనలు జీతగాండ్రచే ప్రారంభింపబడినవి. ఆడ,మగ అనుభేదములేకుండ పొలమువద్ద ఆడుచుండిరి. అది వారి కలవాటయ్యెను.

ప్రాచీనము నుండి నవీనము వరకు ప్రజల మధ్య సొంపైన రంగమువలెని నోదకార్య క్రమములు మెరుగుల తీర్చిదిద్దినవి. స్త్రీలు ఆడుట పాడుట యందు అవకాశములను సద్విని యోగపరచు కొనుచుండిరి. సికతని యిట్టిమృదు భావములచే కొలుకొను చుండెను. అవిడ సాధుత్వమందుకు కారణభూత మయ్యెను.

ప్రకృతి కదలికలోని ప్రతీకారమునకు ఎప్పుడో నాశము జరిగెడిది.

భూపేష్‌నకు జీవిత సౌఖ్యము లభ్యముకాలేదు. పెద్ద భాగములు తగిన పనిలేని పై బీడుపడి నుండ కిరణ్ భవిష్యత్తులో సౌఖ్యమును తలపలేని పరిస్థితికి వచ్చెను.

దివా రాత్రములు విధి నియమమును ఆటలాడించు చరిచేర పోటీపడినవి. అమధ్య మారమున కూలిపని స్వయంజన్య బిందుపూర్వక సంయోగమైనదిగా పొడమెను. అది అన హ్యతకు చిహ్నమై సూక్ష్మ తరమైనటుల రాణింపకు రాలేకపోయినది.

సికతని అట్టి సహోద్భవమగు సుగుణమును, అట్టి రేణువులను తనలోగలిగినట్లు భవిష్యత్తు ఆనందమును తలవకుండెను. కొన్ని అభిప్రాయములు సురేశ్‌నకు సంబంధించి నంత వరకు పరిశుద్ధమైనవిగా యుండెను. తానొకవిధిచేత త్రిప్పపడుచున్న బొమ్మవలె తనలోచింతనల తలంచుచుండెను. మోసపుచ్చబడిన దానివలె నెంచెను. ఆవిడ అభిప్రాయములు ఎన్నో దశలుగా విభజింపబడినవిగా యుండినవి.

కొన్ని తడవల రాజకీయ విషయములను గురించి సికతని లోతుగా ఆలోచించెడిది. ప్రకృతిలో హాయిగా తిరిగెడిది పక్షి. అటులనే సామాన్యపు పిట్టలు రాజకీయములని సికతని అభిప్రాయము. రాచకీయముల నిర్ణయించు చట్టములధీమా తనమున కర్షకుని చేలలో పక్షులు తిరుగు చుండునని ఆవిడ తలచెడిది. మనము మానవులము కావున మనలోని మరోరూపమునకు గలస్థానమును అశ్రద్ధగా తృణీకరించుట సమంజసము కానిది. విచక్షణ అత్యవసరము. కాకులలో ఐకమత్య ముండును. మానవత్వములో లోపించిన సుగుణముల నర్జించుట యత్యావశ్యకం.మనము మనహక్కులను తెలుసుకొన వలెను.

పెంటాకిజేసిన తృణపూలిని జూచి సికతని అభినందించెను. తన కన్నులను తానేనమ్మలేక పోయెను. చేలలో దిష్టిబొమ్మలను జూచి పక్షులు బెదరిపోవుట వాస్తవమైన విశయమే, స్వయంతృప్తి అనునది ఒక ఇచ్ఛ. వాస్తవికత క్లిష్టమైనది యనవచ్చును.

# 17

అవి కార్మికుల సంక్షేమమును గోరుచున్న దినములు.

కష్ట పరంపరల మధ్య పేదవారి బ్రతుకు సమస్యలు భగవంతుని దయకు పాత్రములు కాలేదు. విప్లవము విజయమొందుటలో అసంతృప్తిని కలిగించెను. కూలీల ప్రోత్సాహ పథమె సాధనమై గుత్తాధిపత్యములు విచారించుటకు వీలు కలిగించినది. జానపదులకు సదవకాశము సరై యసంతృప్తి జెందు అలవాటు లేదు. వారు ప్రకృతికి కట్టుబడి యుండిరి. స్త్రీ పురుషులు వినయశీలురు. కష్టమును ధైర్యముగా ఎదుర్కొన గలవారు.

ఒకరోజు చందు, పెంటాజి మరియు యితరులు కలసి ఒక ఆటను సాగించిరి. అది జీవితమున భరింపరానిదైనను నీతి వంతముగా పొందుపరచ బడియున్నటుల వారి బ్రతుకు తీరుతెన్నులను ల్లేఖించు ప్రదర్శనమాయెను. జీవితమునకు పోషకాహారము కళయని తెలియ వలయును. సురేశ్ భాగము పేరయినపుడు కుమార్‌నుగూడ, రమేశ్ పంచి వదలిపెట్టెను. కొంత కాలము భూపేశ్, సురేశ్ ఆస్తిని సాగుచేసెను. ఇదియంతయు కిశోర్‌నకు పట్టింపుగా లేకుండెను.

పెంటాజి కురువృద్ధుడు. అతని జీవితములో చాల భాగము గడచినట్లుగా వయసు తెలుపు చుండెను. కుమార్ మరియు చంద్ యవ్వనులు. జీతగాండ్ర విషయములో వయసు జీవితమునకు అనుబంధముగా ఉద్యోగకాలము వినయమును ప్రదర్శించెడిది.

పోరాటము ప్రారంభమైనను స్పష్టమాత్రమై సత్యమును ల్లేఖించుచుండెను. విషయ ప్రసక్తి కఠినమై యుండెను. జీవితము పై అప్పుడప్పుడు కిరణ్ ఏవగింపు జెందుచుండెను.

"ఈ కష్టములను నేను భరించలేను." కిరణ్ అనెను.

వాస్తవిక జీవితభాగము కిరణ్‌ను ప్రోత్సాహముగా భవిష్యత్తు జీవితమున నడుచుకొను టను గమనింప జేసెను. కిరణ్ నిజముగా జీవితపు పూర్తి హృదయముతో తృప్తి జెందుటకు తనలో సంతృప్తిని పటిష్టపరచు కొనుచుండెను. అతను తన సేవకు రైతులచే పొగడబడెను.

కిరణ్ యవ్వనుడుగా యుంటే చందునకు ఎందరో పిల్లలు కలిగి అతని నిశ్చింత సంసారమయ బాహ్య యుక్త జీవితము సాగుచుండెను. చందు జీవితమును తన జీవితముతో పోల్చు కొనెను. నీతి బ్రతుకు సమస్యలతో నాకర్షించెను. అటులనే కిరణ్ జీవితము దేనినో ఎదురు చూచు చున్నట్లుండెను.

కేవలము కుమార్, ఆనంద్‌లు మాత్రము తమ జీవితమున ప్రవృత్తి వెలుగుల నింప యత్నించుచు నీతివంతము జేయ నడుకట్టుచుండిరి. అదియు తిరుగుబాటుగ కొందరిని వెర్రిగా

ఊగించెను. ఇట్టి కార్మికుల సమస్యలలో అంతర్యము ఆదుపులో పెట్టరాని దయ్యెను.

పెంటాజి మరియు యితరులు సృష్టికర్త యొక్క పుంజీభవించిన శక్తిని పొగడుచుండిరి. అతను హరిజనుడైనను మంచికాపు వలె కన్పించెడివాడు. మంగ, పెంటాజి యొక్క చురుకైనభార్య.

కుమార్ జ్యోతిని వివాహమాడెను. అదివారి జంటకు నిదర్శనమయ్యెను. ఏ సమయములోనైనను చందు స్వయముగా సేవను విశదము చేయుటకు సిద్ధముగా యుండెను. అతను జీవిత సమస్యల వాస్తవికత విషయముల తెలుపుచుండెను. ఆ విశయములు అద జీవితమునకు సంబంధించినవై యుండెను. అతఃకలహమునైనను పెద్దయుద్ధమైనను పెనుభూతము లాంటి దుష్టగ్రహమని వారు అభిప్రాయ పడెడివారు దానిని శాంతింప జేయుటతప్పని సరియైయున్నది. మన నిరంతర కృషిలోని సేవాతత్వమే దానిని శాంతింప జేయుచున్నది.

ఆనంద్ ఒక తడవ వ్యగ్రామమునకు వెళ్ళెను. కొద్ది మంది ప్రజలు కుమార్‌నకు కొన్ని నెపములు జెప్పిరి. వారిద్దరిపై ప్రతీకారము తీసుకొను ఆలోచనలలో నిమగ్నులై యున్న ప్రజల విషయము కుమార్‌నకు తెలియకుండెను. జనతకు వారి అతివినయ మొకనేరముగా తోచుచుండెను.

నిష్కల్మషమగు అంత్యమువరకు సాంఘిక నిర్ణీత మార్పులు కొనసాగింప బడిన రూపము దాల్చినవి. మానవత్వము యిటువంటి శక్తిని ఉత్పాదించుటకు ప్రయత్నించెను. కావున సన్నిహిత గుణము భిన్నతత్వముల మధ్య చెదిరి పోయినది. అది నిదానమగు విషయము కాలేక ఇతర సిద్ధాంతముల నదుపులో పెట్ట లేకుండెను. వారు సంతోషముగా బ్రతుకరైరి.

కేంద్ర బిందువు అతిసామాన్యమైనదిగా యెంతో బరువును ఆకర్షించు శక్తివలె దృఢత్వమును సమకూర్చు చున్నది. సురేశ్ యేమాత్రము తనలో మెదలు అతి దాక్షిణ్యపు టున్నతమగు గొప్పదనము నపుడు అదుపులో బెట్టజాలని వాడయ్యెను.

"మన కూలీలు నక్షత్రాలైట్లుకారా" దనెడివాడు. చరణదాసు వారిలో అదుపులేని ఆలోచనలు చాలకాలము పిదప కేంద్రీకరించు కున్నటుల నాగరికత మనస్కులవలెరేకెత్తినవి. చరణదాసు అభిమానమును సురేష్ గమనించెను. "ప్రశాంత మైన ఉదయాస్తమయముల వెనకనే అగ్ని పర్వతముల వలె నక్షత్రాలైట్ల చరిత్రదాగి యున్నదేమో!" సురేశ్ విస్తుపోయెడివాడు

సోమకుడు చరణదాసు పిల్లవాడుగా నుండగ ఆ సంస్థలో చేరెను. చేతకి అమనామె అతనిభార్య. చరణదాసు వారిని గురించి దగ్గర చూపుతో తిలకించి ఆశ్చర్యపడెను. వారు సంతానహీనులు.

"సంఘ జీవనము గర్వమునకు, శక్తికిని కొరగానిదై అంచు మించు గానక యుండుట లేని కోనమో!" చేతకి సోమకున్ని ఎగతాళి పట్టెను.

సోమకుడు ప్రత్యుత్తర మీయలేదు.

చేతకి సోమకున్ని ఉన్నంత కాలము ఆదరించినది. ఆవిడ మరణము అతని కెంతో విషాదమును కలిగించెను. ఆవిడ పలుకులనే స్మరించెడివాడు. పరిషత్తు స్థాపించబడి నపుడు చేతకి మరణించెను. ఎడమచేయికి పక్షవాతము వచ్చినట్లు, వామలోచన దృష్టిలోపము వలె తన సర్వాంగములలో సగభాగము రోగపీడితమై యున్నటులను చేతకి లేని లోటుచే సోమకుడు బాధపడెడివాడు. ఉత్తమ సరస్సులలో మత్స్యములు, తామరలు కదలినట్లు చేతని కనుసన్నల కదలిక అతనిని పిలిచి నట్లుండెడివి. ఒకనాడు సురేష్ అతని వాక్చమత్కారమునకు ఎంతో తీయగల దనెను.

పని వారెందరో సోమకున్ని లెక్కచేయక అల్లరి చేయుచుండిరి. "ఎడబాటు తుంటరితనము, కలయికయను బక్కపలుచని తనువునుఛీ కొని బెదిరిస్తే ఏంచేస్తుంది! పాపం! బిక్కమొహం వేసింది!" అని అంటే అందరి మొహాలలో జాలి మిరిమిట్లు గొలిపినట్లయింది.

ఆనంద్‌నకు వెంకటపురం మీదగల అభిమానము, ప్రేమవృథా అయిపోయింది. నిలువనీడలేక బతుకమ్మ తన తమ్ముడైన సీనయ్య దగ్గరనే వుండిపోవుటకు నిర్ణయించుకొనెను.

# 18

కిశోర్ స్వయం కృషి యుద్ధరణ సూత్రమును వల్లించుచుండెను. సంఘమొక క్లిష్ట స్వరూపిణియయ్యెను. కిశోర్ సంఘము లోనే విషయము తెలుసుకొనలేని స్థితి యందుండెను రమేశ్ ఊగులాడు ప్రకృతి గలవాడు.

"నీ వెళ్లున్నావు? కిశోర్"? అని పెక్కుతడవల ముకుంద్ అడిగెను. ఎందుకు?

ముకుంద్ అది తెలుసుకొనలేని వాడైనను తిరిగి దాని ప్రస్తావన తెచ్చువాడు కాదు. సరళ అతని గురించి తెలుసుకొనెడిది. సరళ ,ముకుంద్ నేమియడిగినను పునరావృత్తమగు స్పందన గుప్తలను అతని గురించియే తెలిపెడిది. అది కేవలపు భవిష్యత్తు యొక్క అనిశ్చయపు విషయముల కేంద్రీకరణమై యుండెను. అతను గొడ్డువాడై నందున ఏదో ఆలోచించు నటుల, చరిత్ర యొచటికో తీసికొని పోవు విషయమునే తలంచెడివాడు.

కిశోర్ మామూలుగా అన్ని విషయములపై దయచలిపెడి గుణము కలవాడు. చెడ్డవినయమగు పనులను, తన మనస్సుకు వ్యతిరేకమగు వాటిని చేయువాడుకాదు. రమేశ్ మూగవాడు గాక ఆతురతలు తొందరగా వెంటాడుట వలన యేదో మాటాడువాడు కిశోర్‌నకుబ్రతుకులో

ఉత్సాహపూరితమగు తపణము నొంద వీలుకలుగలేదు. విధి కిశోర్ పైపు నవ్వినట్లుగా గుర్తు కొన్నదై వట్లుండెను అది మనస్సుకు ప్రశాంతత గూర్చలేదు. ఎప్పుడేమి చేసినను కొంత వరకు విచారముగా జేయుచుండెడిది. అది కష్టము, నొప్పి యొక్కయు అడ్డు అయ్యెడిది. క్లిష్టపరిస్థితులలో నున్న కిశోర్ విధి యవశ్యకతను జయించ లేక పోయెను. అతను అభిప్రాయములతో సిద్ధము చేయబడ లేదు. కంచెపైపు వెళ్ళినపుడు పచ్చి సీతాఫలములను కాల్చితినెడివాడు కిశోర్. రంగుల దుస్తులపై యిష్టముగలవాడై యుండెను. లిబియా ఎడారి గురించివిని తన బ్రతుకు బాధలను పోల్చుకొని నిరుత్సాహ పడెడివాడు.

ముకుంద్ వ్యవసాయపు పనిని పర్యవేక్షించుచునే యుండెను. చందు తెచ్చిన నేల రేగుపండ్లను ముకుంద్ ఆప్యాయముగా తినుచు “రేగు పండ్లలో” మధుర రసము వాని ముళ్ళ భద్రత కొనియాడ తగినవి” అనెను. కిశోర్‌నకది నచ్చలేదు. ఆరోజు మధ్యాహ్నము వరకు రమేశ్, సికతని పొలములో పనిజేసి వెడలిపోయిరి.

శ్రమమైన పని వృష్టిన గడ్డి, చొప్ప గురించి తలపెట్టి పెంటాజిచే కొట్టము వేయించుటకు ముకుంద్ విశ్చయించినందున ఆరోజు కొట్టముపని పూర్తి చేసిరి. గడ్డిబంతి కట్టుటను, పశువులకు మేత వేయుటను, ధాన్యము నుపయోగించు తీరు నెరిగినంత తీరుగా భృత్యులకు నెల జీతము లిచ్చుట నెరుగకుండెను కిశోర్. వారు తగినంత ఉత్పత్తి గురించి పెట్టుబడి గురించి తలపకుండిరి.

ప్రకృతి స్వయముగా కొన్ని బ్రతుకు అడ్డంకులను ఒక దశకు కోరియుటయందును శక్తిని త్రిప్పుట యందును స్వయం వేగము కలిగియుండెను. వసంతములో ఒకటి రెండు వర్షములు పడినవి. అధికముగా చీమలు కప్పలు చుండెను. కిశోర్ తక్కువగా పర్యవేక్షించెడి వాడు. భయపడువాడు కాకుండెను.

సూర్యుడతివేడి గలవాడై యుండెను. అదియేమి తలపనివాడై పెద్ద పెంటబొందనుండి పెండను త్రవ్వమొదలిడెను. అది మురికినీటి మయమై యుండెను. అది సహజమైన బలము గల ఎరువు యని ప్రతీతి గలదు. బాలతో యిటుకలతో కట్టబడిన గోడకు పెంటబొంద అంటుకొని యుండెను.

అకస్మాత్తుగా గోడ అతనిపై కూలెను.

ముకుంద్ పొలము మూలన చెట్టు క్రింద కూర్చొని యుండెను. వాస్తవికముగా నక్కడ అందమైన ఆకర్షణగా చెట్లు హరితమై యుండుట దోచెను.

కిశోర్ యెప్పుడైన అట్టి మనోహార దృశ్య భావముల జెందినచో భవిష్యత్తుతో ఏదైనను గుస గుసలాడెడి వాడు. కోళ్ళుబెదరు చుండెను. పశువులు అరచు చుండెను. పెంటాజి

మరియు చందు యింటికి పోయి యింకను రాలేదు. ప్రకృతి చిగురించుచనముతో పాటు కృశించిపోవునైజముగల భావమును తెలుసుకొనని కోకిలవలె ముకుంద్ గుస గుసలను మరచిన ట్లుండెను.

నరకమే మాత్రము తెలుపనట్లుగా భయంకరమైన నిశ్చేష్ట విసుగు చున్నట్లుగా ముకుంద్ తెలుసు కొనెను. అతను కిషోర్ ఇంటికి వెళ్ళెనని తలంచుచుండెను, కాని యెప్పుడైతే అతను యిటుకల క్రిందను తాలక్రిందను చచ్చి యుండుట గాంచెనో విధివశమున కష్టుడు ఎంతో దుఃఖించెను.

# 19

అది చలికాలము. ఆనంద్ మరియు కుమార్ పొలములోపని చేయుచుండిరి. కిశోర్ యొక్క విషాదకరమైన మరణము గురించి యే తలంచుకొని భయపడసాగిరి.

సికతని పొలములో నాటు వేయించుటకు వెళ్ళుచుండెను. పెంటాజి, చందు మాత్రము రమేశ్ వద్ద జీతముండిరి. అయినను నాటువేయు సమయమునకు కూలీలు అందరు కలసి వచ్చుట పరిపాటి. కిరణ పొలము, సికతని పొలములు దగ్గర దగ్గరగా నాటు వేయవలసినవి, నాటుకు సిద్ధము చేయబడి యుండినవి,

కూలీలు బీదలై క్షుద్బాధితులైనను కష్టపెట్ట బడినవారివలె లేకుండిరి. వారి నడకలోని ఒయ్యారము జీవితపుటుత్సాహమును పరామర్శించు గర్వముట్టి పడునట్లు తొణకుచుండెను. గుస గుసల గలగలతో వారు పని నిమగ్నులై యుండగా దుఃఖాతిశయమున ముంచు నీటి వరద ఉప్పెనవలె పొడచూపెను.

ఆగుంపు వారివైపు వచ్చుచుండగా కడియములు మెరుస్తున్నవేళ దూరముననున్న దృశ్యమంతయు అద్దమున కన్పించినట్లుగా కన్పింప మొదలిడెను.

ఎగిరి వస్తున్నట్లువారిలో జ్యోతి నల్లని పక్షివలె కుమార్ కంటబడెను. అతను ఆ వెలుగును జూచుటకు ఉత్సాహపడు చుండెను. ఏలననగా నల్లని బ్యాటరీసెల్ వలె, కుట్టిన పుస్తకం లోన పుటలలో వ్రాతనడకల దీప్తివలె వారు అడుగులు వేయుచున్నట్లుగా అతని వైపు వచ్చినవి, అకస్మాత్తుగా వారికి సికతని కన్పించెను. మంగ మరియు తారల మధ్యన ఆ గుంపులో ఆవిడ కదలివచ్చు చుండెను. ఆవిడ మందారపు మొక్కను జూడ మొదలిడెను. నల్లని పక్షి ఉదయ కిరణముల వెను వెంట వచ్చు చున్నటుల కుమార్ జ్యోతిని గూర్చి తలపోసెను. ఆనంద్ జీవితమును పరామర్శించుచున్న వాలకము లనిపించుచుండెను. అతనికా శుభోదయ మెన్నడో యనునట్లుండెను.

పాలేర్లు మామూలుగా జానపద గీతములను నాటు పెట్టుసమయమున పాడుచుండిరి. అవి బృందగీతములో సంగీతమును వీనుల విందుగా వినిపింపజేయుకిళ. వారు పాటపాడిన పుడు ప్రకృతి ప్రతిమవలె ప్రశాంతముగ నుండెడిది. వారి ప్రేమను చూరగొను మాతృశ్రీ వలె కరుణనే ప్రసాదించు చున్నట్లుండెను.

సికతని భవిష్యత్తు నాలోచిస్తు సోదరుని మరణముచే విషాదమొందెను. ప్రకృతి అవి డను దుఃఖింప జేసెను. చిన్ని చిన్నిచీమలు అక్కడక్కడి కదలికలతో సికతనిని కదిలింప జేసినవి. చరాచరమంతయు సికతనిని పరామర్శించుచున్నట్లుండెను.

కుమార్‌పైకు పని నిమగ్నతపై విచారము కలిగెను. నిజప్రకృతి నాలోచించలేదు. నవ్వుచున్న కూలీలు ఊహాగారడి విద్యచే కుమార్ ఎవరికి నష్టము చేయలేదనియు, ప్రేమ పశువులు పండించే పంట జనత కెంతో ప్రయోజనకారి యనియు గేలి మాటంతో నాటు పని ప్రారంభించిరి. సికతని విచారము నెరిగినవారు మామూలు ధోరణిలో పని పూర్తి చేసి వెడలి పోయిరి,

రమేశ్ విధి నియమమునకై వగచెను. సరళ కిశోర్ మరణముచే కష్టముజెందెను. సికతని కేపని చేయుటకును సిగ్గు చేటయ్యెను.

వాస్తవికమగు వస్తువులు పృథ్వీ మూలముగను ఎంతో అందముగా చేయబడినవి. ప్రకృతి తన దారినేదో మోగించుచున్నది. సృష్టికర్త తృణపూలి నేవిలువతో లోకమునకు ప్రసాదించునో యేయే జీవులు తమ రూపము నర్థము జేసుకొందురో యను ప్రబోధ జరుగు చున్నట్లుండెను.

సికతని తన అభిప్రాయముల నుండి కోల్కొనలేదు. రమేశ్ చెడ్డపరిస్థితులచే దుఃఖ పీడితుడై యుండెను.

ఎట్లయినను సికతని వివాహ విషయమున సరళ ఒక నిశ్చయమునకు వచ్చెను. ముకుంద్ మరియు ఇతరులు వీళ్లును బట్టి వరాన్వేషణ జరిపిరి. సికతని స్వంత యోచనల గమ్యము గురించి తలపోయుచుండెను.

సురేశ్, కిరణ్‌తో విజయపురి వార్తల నెరిగి విషాదము కనబరచెను. తన ఆకర్షణ శక్తిని కోల్పోయిన రమేశ్ కుటుంబ స్థితిగతులపై సానుభూతి ప్రకటించెను. ఆతను బ్రతుకు బాధ ననుభవించుచుండెను. "ఈర్ష్యదుండ గీడు" అని సురేశ్ అనుకొనెను. వాస్తవికత నిరంతర పోరాటమువలె విషయములు సన్నిహితోద్భవపు స్నేహమునకుదారి తీయును. ఒక రూపము భావము యొక్క నిజమైన చిత్రము. బాంధవ్యములోని నిజమైన ఆకర్షణను సురేశ్ గమనించెను. అదృష్టముచే వాని నడుపులో యుంచు మలుపు నెంచెను. మార్పు అను నది ఒక కదలిక. అయినను దాని కార్యకలాపములనది నమ్మకొనును.

అతను అదృష్టమును స్పష్టము జేసుకొను ప్రయత్నమున నిర్విరామముగ పాటుపడు చుండెను.

ఉరుక నేర్చినవానికి గుఱ్ఱం పరుగు ఒకలెక్కా? సురేశ్ బ్రతుకు పరుగును నేర్చిన వానివలె అనుభవము కొద్ది ఒక పక్షియై పోయినట్లుండెను. కాని అతను నియంతవలె చెప్ప బడవద్దు. అతను సామాన్యుని కళయగు "తృణపూలి" చే భయపడ వచ్చును. కావున అధి కారము ఎప్పుడును మోసపుచ్చబడరాదు. అతనిలో ప్రయత్నపు శక్తి ఉట్టిపడుచుండెను.

# 20

రమేశ్ హృదయ వైకల్యపు నడవడులు జీవిత సమస్యలలో గుసగుసలాడినవి. అతను వాటిని మరవలేకుండెను. ఇడుములు ఇక్కట్లు ఎలవానికంటె ఎక్కువగా బాధిస్తాయి. అతను బెదిరిపోయినట్లు అకస్మాత్తు దానికి గురి అయ్యెను.

భూమిలేని వాని విషయము చెప్పవలసిన దేమున్నదనగా అవకాశము జీవిత సమస్యల వరకే వారు నియమింపబడి యున్నది సత్యమనుటయే. ఇట్టి కష్టపు సమస్యలతో దుఃఖపు తటాకములు నిర్మింపబడినవి వాటిలోనికి బ్రతుకు వీధుల అపవాదములు ప్రవహించుచున్న టుల పొంగి పొరలిన సెలయేరుల తీరు సమస్యలుండెను.

సురేశ్‌నకు భువనేశ్వరములో యుండువాంఛ జనించెను. చరణదాసు అట్లు తలంచి యుండలేదు. అయినను అచటగల గౌతమ్, సురేశ్ సహోద్యోగి బంధు పరమైన వ్యక్తితోనే యుండవలయునను యిష్టము మూలమయ్యెను, గౌతమ్ చరణదాసుచే గుర్తింపబడిన విద్యా వేత్త. దేశ సేవకై నియుక్తుడైనవాడుగా పేరు మోసినవాడు. స్నేహ ప్రియుడు.

గౌతమ్‌నకు తన జన్మస్థానము తెలియదు.

చరణదాసు సంస్థ అతని యవ్వనమునకు పూర్వము నుంచి పేరుమోసినదై గుర్తింప బడి యుండెను. చరణదాసు తండ్రి పేరు ప్రభుదాసు. చరణదాసునకు గౌతమ్ గురించి గత స్మృతి కలుగుటకు కారణము ప్రభుదాసు భువనేశ్వరము వెళ్ళగా కర్మాగారములో పని జేసి విశ్రాంతి గొనిన ఒక వ్యక్తిని తిలకించుటయే. ప్రభుదాసు అపుడే స్వంత కర్మాగారము స్థాపించి తన సంస్థకు 'చరణదాసు' సంస్థ అని పేరిడెను. కార్మికులకు మార్గదర్శకుడైన అవ్యక్తి గోవిందుడు.

"ప్రభూ, గౌతమ్ మరియు లత వారి భవిష్యత్తు నెరిగి మీ రక్షణ బడయుటను నేను కాంక్షించినది ఆనందముగా నొప్పుచున్నాను. నాకేమి విలువలేదు; నా ఆస్తి గోదావరి చేత తుడిచి వేయబడినది. నన్నేమి పెద్ద చేయజాలదు." అని గోవిందుడనెను.

"దేవుడు నిన్ను కరుణించుగాక. లలాటలిఖితమునకు విచారించకుము. ఏలయనగా నీభార్య దక్కి స్వర్గము నుండి తిరిగిరాదు." ప్రభుదాసు పలికెను.

చరణదాసునకు పైన్కృతి సంస్థను తీర్చిదిద్దుటకెంతో ప్రయోజనకారి యయ్యెను. అతను భారతీయతను మరచిపోలేను. ఇతరుల సన్నిహితత్వము నాకాంక్షించుట యందునిమగ్నుడై యుండెను. తండ్రి సిద్ధాంతమును నాకళింపు జేసుకొనెను. స్వయంగా పరిషత్తు నేర్పరచి ప్రాచ్య విజ్ఞానబోధ జరిపించ మొదలిడెను. అందరి జేత అది పొగడబడగా వారు వారి కష్టములను విస్మరించిరి.

రాలిపోయిన పువ్వుకోసం తరువు ఏడ్వకమానదు. రమేశ్‌నకు భాగ్య నగరములోనున్న క్రొత్త వారి పరిచయము చేసుకొని సికతని వివాహము జరిపించుటలో అలస్యమయ్యెను. వారు పేరుమోసిన వారై యుండిరి. సురేష్ భువనేశ్వరములోనే యుండిపోయెను. వారికి సురేష్ సంబంధపు వ్యవహారములర్థమై పోయినవి. అయినను వారు సికతనిని స్వయంగా జూచి వివాహమునకు ఒప్పుకొనిరి. ఈ విషయములన్నియు కిరణ్, భూపేశ్‌లకు విచిత్రములై తోచినవి. రమేశ్ వియ్యంకుడు ప్రసాద్, అతని ఏకైక పుత్రుడు ఉపరిచరుడు. ముకుంద్‌నకీ విషయము తెలియదు. రమేశ్ వారి గొప్పదనమునొక ప్రత్యేకతగా తన లోకాను తలంచెను. చాలకాలము నుండి ఎక్కడెక్కడో వారిశక్తిని గొప్పదనమును వినియుండెను.

సికతనికి అనూహ్యముగా విధిలీలవలె ఉపరిచరునితో వివాహము చేయబడెను. ప్రసాద్ యిష్టమైనటులుగా వారు అన్యోన్యము బంధువులైరి. ఇట్టి విషయములు సంఘమునకు ప్రధానమైనవి; అవి సంఘమును ఎప్పుడును మార్పగలవు. దాసరిని ఊనలవెల్లి బెదిరించినట్లుగా ముకుంద్‌ను పెద్దరికము కలవర పెట్టినది. ఆశ్చర్యముగా నీసమస్యల వన్నింటినతను దాటెను వరళ కెప్పుడు ముకుంద్ ఆలోచనలు సాంప్రదాయ రహితముగ దోచెనో అప్పుడు విధిపూర్వకముగా కరుణించెడిది.

సికతని సొంపైన బ్రతుకును తనలో నాశించినైజముగా బ్రతుక నారంభించెను. వారు చెక్కబడిన బొమ్మలవలె నాగరికతలో నొకస్థితిని కదలించిరి. చరిత కొక రూపమును వచ్చినట్లుండెను. ఉపరిచరుడును, సికతని ప్రియమైన జీవితమును గడుప నారంభించిరి.

ఉపరిచరుడు దైవిక ప్రకృతి నెప్పుడు నాలోచించ ప్రయత్నించ లేదు. తన విషయమును క్షున్నముగా పరిశీలించు చుండెను. అట్లుకాని విషయమైనను విజయపురిలో నెవరికి తెలియరా కుండెను. ప్రకృతి నిర్ణయము స్త్రీ భావనవలె సికతనిలో గొప్పమార్పును కలిగించెను. పుట్టినింటికి అత్తవారింటికి అడపడుచు కల్పించు ఉదాత్తమగు సమన్వయమును రమేశ్ గుర్తించెను, ఉపరిచరుడు యిష్టపూర్తిగా ఒప్పుకొనెను. అతను కష్ట జీవితమునే గడిపెను. సైకతము

వములలో ఉపయోగ కారికమైయుండును. ఎడారులలోని ఇసుకకు వదులలోని ఇసుకకు తేడాయున్నట్లు కష్టములచే వచ్చు లాభనష్టములెన్నో గలవు.

కిరణ్, ఉపరిచరున్ని మర్యాదగా మందలించెను. నూత్నవధువు దీపావళికి విజయపురికి వచ్చెను. సికతని, విజయపురి వారిమర్యాదలు తెలిపి ఉపరిచరునితో భాగ్యనగరమునకు వెళ్ళెను.

# 21

సురేష్, సంస్థ ద్వారా ప్రజల మధ్య తన నిస్వార్థసేవ యొక్క గొప్పదనమును పొందుచుండెను. సికతని వివాహము ఉపరిచరునితో జరిగిన విషయము తెలుసుకొనెను. ఆతని సంతసించి వారిమంచి బ్రతుకునే యోచించెను.

భవిష్యత్తు ఒకవింతగా యుండెను. బహుశః సురేష్‌కు అది నిర్వహించవలసిన క్లిష్ట విషయమైన జీవిత మొక సయస్యగాయుండెను. దానికి జోడుగా ప్రకృతి విషాదము జీవితముపై నిర్వహణాత్మక దృష్టి గల సంఘమువలె మెలగజొచ్చెను. సంఘమును దెలుపు సత్య పరిశీలనమే ఆదిమైయుండెను.

తత్త్వము యొక్క గొప్పదనమున సాక్ష్యములు లోగుట్టు ఛిద్రములు కావు, మరియు కూలీల మానవత్వము ప్రసాదింపబడిన గుడ్డి భిక్షకాదు. కదలిక మరియు పని ఒక కొలతను గలిగి యున్నవి. పట్టుదల మాత్రము ఏకాంతముగ తిరుగులేని గట్టి పనినే చెప్పుచుండెను. ఎవరి కొరకై మలచబడినను ప్రదర్శింపబడినను సంతాన శిల్పము దుర్వినియోగ పరచబడిన దను వారు వారి బిడ్డపై ప్రేమను తెలుపజాలరు.

చరణదాసు బెంగుళూరులో వ్యాపారమును చేయవలసివచ్చెను. కన్నడ పరావర్తనము యంత్ర పరికరములలో కదలింప జేసినది. ఈ చక్రభారము ప్రజాసుకరణ శశికళ దీప్తి జిమ్మునట్లు, రంగుల మేళనమున్న తెలుపు కాంతివలె యతని కర్తవ్యము ఇంద్ర ధనస్సువలె మరో దేశమున కీర్తితేజమున పొడచెను. సజల నిష్కల్మషజలపాతము శక్తివంతమై అవసరమైనంత ఆహారమును ఉత్పత్తి జేయుచున్నది. అది విద్యుద్మతాభీష్ట శక్తి వినియోగమును ప్రతిపాదించి మన మేలుకై పని చేయుటకు మాట యిచ్చుచున్నది. సురేశ్ ప్రకృతి ప్రత్యేకతను ప్రశాంతముగా త్వరలోనే తెలుసుకొనెను. అనుబంధ ప్రగతిచే సంస్థ ధనవంతమునై బలపడెను. కదలి కృషిలో కర్తవ్యముగా భామడు పనిపాట్ల మేఘముల కదిలించెను. తెలుగు ప్రవాహ రూపకళల ప్రతి బింబించు రూపమె రసిక మెరుపులే కావేరి జలపాతమున ఆంధ్ర జాతి మెరపులై తోచినవి.

చరణదాసు సంస్థలో విక్రమ్ మరియొక వ్యాపార ప్రతినిధి అతను చాల తడవల బెంగుళూరు వెళ్ళునవకాశముండెను. అతని తల్లిదండ్రులు భవాని, హరి యచటనే స్థిరపడిరి. విక్రమ్ అచటనే యుండవలసి వచ్చెను. మంచి పదవికి పేరుగాంచెను.

రూప క్రమముగా వారి ధనమును జూచి తొలుపొల్త విక్రమ్ను కోరినదయ్యేను ఇద్దరి మధ్య పరస్పరాకర్షణ జనించెను. జన్మనుల విజ్ఞాన సాగసు రీతిని విక్రమ్ ధన్వంతరి వలె సంఘాధికారము కలిగి యుండెను. అతని భావన ఎన్నడతనిని పరాజితుని జేయలేదు. సంస్థలోని యంత్ర పరికరమువలె విక్రమ్ మూర్తి రూప ప్రేమ విద్యుత్తు గురించి పాట్లు జరిగి నట్లు అతని విచిత్ర మానసము పొంగి పోయెను.

"ప్రజల అభిమతమును జారగొనుటయే ప్రైవేటు సంస్థల ముఖ్యోద్దేశము." చరణ దాసు అనెను. "సంఘము నిర్ణయించెడి కొలతలు మన పని పాట్లు."

ఈ మధ్యకాలమున విక్రమ్ సంఘపు పునరాలోచన సిద్ధాంతములకు కట్టుబడి యుండి అవకాశముం దగ్గరగా బ్రతుకు సాగించెను. హరి హృదయ జన్మాళి ప్రాయమేదియు బల వంతమైనది కాకుండెను.

సంఘపు పని అలవాటును రోజు లెన్నడును గుర్తించినవి కావు భవిష్యత్తు సహకార దృష్టితో స్వయం ప్రపత్తి అదృష్టమును తిలకించుదానివలె పడియుండెను. విక్రమ్ అట్లు పనికి కృతజ్ఞుడయ్యెను. అతను బ్రతుకుననహించు కొనక అన్నికష్టములను భరించెను. అభివృద్ధి కాలమున భీతిజెందలేదు. అతని ఉత్సాహము, ఆసక్తి మరియు చురుకు దనము తనిని ముందుకు త్రోయటలో వెనుకాడలేదు. ప్రతి ఒకడు సమత హక్కుచే జన్మించెనని అతడు ఎరిగెను. ఒకడు పరిష్కారమును తలచుటలో ఇరుపైపుల కత్తులలాంటి భావనలను కరగించి మరో సాధనము తయారు చేయుటకై ధర్మమనెడి శుద్ధాగ్ని నుపయోగించ వలెను. అది అతని దృక్పథమై యుండెను. మోసం ఎరిగి ధర్మాన్ని నమ్మితే లాభమేముంది? అందుకే ధర్మము శక్తివంతమై యుండవలెను. మోసము రాక్షసియైనచో ధర్మము దైవమగును.

సంస్కృత సుభాషితముల నతడు నేర్చెను మరియు వాటిని శ్రద్ధగా ఆకళింపు జేసు కొనెను.

అని తెలంగాణ పునాముచి పడెము-గొంగడిలో పట్టునంత దినుసులు

"మోపు మోయని వానికి సడెముతో కూలి వస్తుందా?.... నాయనా?" హరి యనెడి వాడు. "కార్మికుల గోల తెలియదు బాబు."

"దావ లేని ఎద్దు రైతునే తన్నింది.... నాన్నా." విక్రమ్ బదులు చెప్పేడివాడు. "మన దేశము ప్రగతి జెందాలంటే కూకటి వేళ్ళకు గల చీడను తొలగించాలి. దరిద్రపు ఊరిలో అధికారి ఒకడు తవఖీ చేయబోయిచచ్చారట."

"పసిబిడ్డకు పోషకాహారమవసరమైనట్లు మన నాయకుల జీర్ణించుకొంటున్న నిన్నుచూస్తే అమితానందం కలుగుచున్నది విక్రమ్ అని హరి ఆనంద బాష్పముల రాల్చెను.

ఆపుడు రూప వారింటికి వచ్చెను.

"అమ్మా ... కూర్చోవమ్మా!" భవాని సన్మానించెను.

"మీరేవో రాచకీయము మాట్లాడుచున్నట్లున్నది?" రూప ప్రశ్నించెను. "విక్రమ్‌గారు మంచి సాంప్రదాయకుడని విన్నాను."

"ఏముంది లేవమ్మా!"

రూప తీక్షముగా వారిని తిలకించెను. కొంచెము సిగ్గుతో విక్రమ్‌తో మాట్లాడుటకు సిద్ధపడెను.

"మీ యోజమాన్యతలోని గొప్పదనమును జూచి గర్విస్తున్నాములెండి." అన్నది రూప.

"మోటనీడ్చే ఎద్దు మోట విరిగితే బావిలో పడ్తుందికదా!" అన్నాడు విక్రమ్. 'జనత ఎద్దువలె కృషి చేస్తే రాచకీయపు మోటవిరిగితే ప్రయోజనం శూన్యం'

'చాల బాగుగా చెప్పారు సుమా!' విక్రమ్‌లో గల కదలికలోని ఆరాటమును గమనిస్తూ ఉండి పోయింది రూప.

అనురాగపు బీజము నుండి పెరిమపు మొక్క మొలకెత్తును. నేటి సమాజములో పరిస్థితుల సూర్యరశ్మి పరిణామ దృష్ట్యా తోడ్పడుచున్నది. స్వేచ్ఛయను గాలి విచ్చలవిడిగా వీస్తున్నది. సంకుచిత తత్త్వబంధములు దూరమై పోతున్నవి. జాలియను కరుణ నీరు విత్తవమును మొలకెత్తిస్తున్నది. విజ్ఞానము జ్ఞానమే ప్రకాశము. చెడ్డ పరిస్థితులన్ని చీకటి మారు రూపాలు.

రూప ఉత్తమ శీలముతో తన భావముల ముసుగు తొలగించనిదై యుండెను విక్రమ్ వద్దానిని యెంచలేకుండ యుండెను.

# 22

సురేశ్ కష్టమైన పని దుఃఖ భూయిష్టమైనను ఎన్నడు దానిని తృణీకరించలేదు. చరణదాసు సంస్థను ప్రోత్సహించినటులనే విజయమునకు మార్గము నన్వేషించెను. గెలుపు

అతనిని వరించెను. ఎదుర్కొనిన బాధలు, యాజమాన్యమునుగని ఆశ్చర్యముతో ఉద్యోగులు సురేష్‌ను తలపమొదలిడిరి.

సామాన్యపు కూలీల వారి భావములను మనః పూర్వకముగా తెలుపజాల కుండిరి. విక్రమ్ వారిపై నాయకత్వప్రభావము కష్టమునకు దారితీయు ప్రమాదము గుర్తించెను. స్వంతయోచనల ప్రభావంవారి మనసుల లెక్కచేయదు దానిని మార్చెను. బలవంతమైన నవవకాశము దానిపై ప్రతీకారము తీసుకొనును.

విక్రమ్ వాస్తవముగా ప్రకృతి మనోభాసురతను గాంచెను. పిరికి యోచనలు కలిగినపుడు ప్రకృతి వెలుగుతో చీకటిని కొలచి చూచుకొనెడివాడు. జీవితపు వెలుగును వినయముగా స్వీకరించెను. అది జానపదుల ప్రథమ ప్రగతి దశను నీతితోచుట్టెను. అతడు దానిని తన ఎదలో భద్రపరచు కొనెను సంస్థ ప్రకాశమానమై విరాజిల్లెను. చరణదాసు తన పట్టుదలను తన ప్రకృతిలోనే కన్పింప జేయుచుండెను. తొలినాటి బాటలు మార్పుజెందుట కెంతో ఓర్పు అవసరమై యుండెను. బలహీనమైన జీవితములకు శక్తి యెంతయో అవసరమైయుండెను.

కేవలము బ్రతుకు తొలిబానిసత్వపు నాటి పథమున నడపబడుచున్నను నియమబద్ధమై ప్రగతి విహాస్థలముల దర్శించుకొన్న తృప్తి కలిగి యుండెను. సురేష్ అట్టి ఆలోచనల దలచుచు సందర్భముల సంగతుల గని దయ బూనుచుండెను.

విక్రమ్ స్వీకృత ప్రయోగములచే ఆనందించుచుండెను.

ఉపరిచరుని విజయపురిలోనే సురేష్ కలుసుకొనెను. వారిలో మర్యాద మధ్య వర్తియయి సన్నిహితులుగ మాట్లాడించినది. సికతని పుట్టినింటికి వచ్చినందుకు అందరు సంతోషించిరి. బహునాళ్ళకు విజయపురి జనులకు సురేష్ గురించి గలిగిన ఆదరాభిమానములను ఉపరిచరుడు తెలుసుకొనెను. కిరణ్‌కు కలిగిన దేశీయ అభిమానము గురించి ఉపరిచరుడు ఏకీభవించెను.

సురేష్‌ను జూస్తుండగా వారికి ప్రకృతి గుసగుసల యందమును చిలకించినట్లుండెను. చలికొండలు, నౌకాశయములు వారిఎదలో సంగీతము పాడినవి. ఎదురువారిని దర్పణముగా గని సురేష్ ఆనందించసాగెను. ఆదృశ్యము జీవితమునకు దారితెలిపినది: బానిసత్వపు వ్యథను పారద్రోలినగానము జేసినది. వారు విజయ సత్యము నెరిగిరి. భావానుకూల పథమును దలచి ఒంటరి వాంఛాపథమును నిరాకరించిరి. ఆతని సంఘ రక్షణము నాలోచించలేదు. కాని దయదలంచెను. అది గుసగుసలాడు విషయమును మరవలేదు. మనిషినిస్థాయిలో వుంచుట సంఘము యొక్కపని. సమాజవికాసము వుత్తమశీల జీవిత సమస్యలను విజయవంతముగా

ఎదుర్కొనును. సంఘాస్తమయమున అనగా క్షీణదశ దాని మూర్ఖతకు కారణమగును. ఇటువంటి సంఘములో ప్రజాస్వామ్య వ్యవస్థ బాగా క్షీణించి యుండుటను అతను గమనించెను.

ఋతువులు గడచిపోయినవి. ముఖచిహ్నముల వలయప్రభల మధ్య ప్రకృతి శక్తి సారధ్యము, భవిష్యత్తు గుసగుసల సందోహమయ్యెను. జలకన్యలు నీటి బిందువులుగా ఆవిరై నీహారరూపమున ఆడు నాట్యకళలతో వారి ముఖవలయ ప్రభలు రాణించెను.

ద్వంద్వ ప్రభావములను ముక్కుద్వార ఘ్రాణించెదము. ద్విగుణ ప్రధానముగ తీపి తేనెరంగు వలుపు, చెరకు తెలుపుదనము ఏకనియమమును హొందియున్నవి. ప్రకృతివ్యాపారమున నిస్పృహాయ స్థితిలో మార్పు రూప వైకల్యము జెందుచున్నది. మనిషికి ఒక కన్ను సూర్యుడై మరియొక కన్ను సోముడై యుండి యున్నటుల యున్నను దైవకార్య సముద్ధరణ జరుగ కుండుట విచిత్రముగా నున్నది. విలువను ఒక కంటిచూపుతో బాధ జెందు యదార్థము దానవత్వమునకు నిదర్శనమైయున్న యంశము నెరుగవలెను. మానవత్వము ద్విగుణప్రభావితమగు అంగనిర్మాణము అర్ధరూపగుణములు ద్వందమై ఏకధారలో ఋణాత్మక ధనాత్మకముల స్థితి విద్యుత్తు జనించును. కేవలం యిచ్చుట గొనుటలో ప్రత్యేకత లేదు. ఇచ్చిపుచ్చుకొనుటయే మూడవ రూపమును సృష్టించును.

ప్రకృతి కిరణజన్య సంయోగక్రియకు ఋతుభేదముల యవసరమై భిన్న నిర్మాణ ప్రయోగనుల జేయుచున్నది. ప్రాణులలోను ప్రకృతి సిద్ధమైన వెలుగులోను సామ్యము గలదు. తేనెటీగలు తమమధువును యితరులు దొంగిలించినను తమనేమి బాధించెదరో అని కుట్టగలవు. సూర్యుడు భూమిని రక్షించినటుల తన దగ్గరకు పోయినకొలది ఓర్చుకొనడు.

పెద్దరూపము ఐక్యతకు సాటె దృష్టిని సారించు ప్రయోగమున అవయవ నిర్మాణము కలిగి యుండును.

ప్రయోజనమగు అనకట్ట లాభము విలువయై ఒప్పును. అవకాశముల స్థితికి కదలిక గల నిర్మాణముల పెట్టుబడి వాటి రూపములను తెలుపగలవు.

అమవసమ దాటుటకే కళపుట్టు చున్నది. కీర్తి చల్లనిదని ప్రతీతి. ఆకలిని తీర్చుటకే అన్నము, సుధ పుట్టుచున్నవి. చీకటి ఆకలితో అలమటించి చిచ్చులో పడనున్నట్లుండెను.

# 23

ప్రసాద్ కూడ అమెరికా, బ్రిటన్, రష్యా, మలేషియా దేశములలో ఆంధ్రుల పాతకాలపు ఆశ్చర్యపు సమావేశములలో పాల్గొనివచ్చెను. భారత దేశము తరపున అభివృద్ధికర

సలహాల నందజేసి ఎంతయో మన్నన బొందెను. తెలుగు మిత్రులతని ఉపన్యాసముల విను టకు ఆతురత జెందిరి ప్రతి విషయమును యితరులతో సంప్రదించి తనలో నిలుపుకొనెడి వాడు. ఏ భావము జేతను అది అటకాయించ బడకుండెను. తెలంగాణ ఉద్యమము ప్రబలి కొందరు చనిపోయిరని చింతించెను. న్యాయవాది చదువు చదివి భాగ్యనగరములో స్థిరపడి మన్ననబొందినవాడు ప్రసాద్. భారతదేశములో తెలుగు రత్నమువలె ప్రకాశించెను. అడుగ డుగున గల తెలుగు నడవడిని అంతర్జాతీయ రంగమున రాణింపుకు తెచ్చుటలో అతను ఎన లేని కృషిచేసెను. ఉపరిచరుడు మొదట విజ్ఞానశాస్త్రము నధ్యయనముజేసి మధ్యన కళలయం దభిరుచి గలవాడై పట్టభద్రుడై ఊరొగ్గెను. ఉద్యోగము చేయనిచ్చగింపక స్వగ్రామమున వ్యవసాయాభివృద్ధినే చేయుటకు పూనుకొనెను. ప్రసాద్‌కు పలుభాషల ప్రావీణ్యమున్నందున అన్ని సంప్రదాయములలోని వెలుగుల కలయికవలె యతను ప్రకాశింప దొడగెను.

"ప్రాచ్యలోకపు ఇటాలియన్" యని తెలుగుభాషను విదేశీలు ప్రశంసించుటచే ప్రసాద్ ఎంతో గర్వించెను. అతనికి విజయపురి సమీపముననే నందిగొండలో బాగుగా ఆస్తి యుండెను. ఉపరిచరుడు ఉద్యోగము నిచ్చగించ కున్నను ఒకసారి స్నేహితుల ప్రోద్బలము చేనిజో ఉద్యోగమునకు దరఖాస్తు పెట్టుకొనెను. సికతని కది యిష్టముగా నుండెను. అతను రైల్వేస్టేషన్ మాస్టర్‌గా సంవత్సరము ఉద్యోగము చేసెను. తెలంగాణ ఉద్యమముసాగుచుం డెను. డివిజనల్ మేనేజరు నవ్వుచు మందలించెను. కాని ఉపరిచరునిలో భయం కలిగెను. స్టేషన్‌లో బీభత్సము చెలరేగి నందుకు అతని మనసు కరిగిపోయెను. అది మధిర స్టేషను. సికతని యితరుల మనసుల జూచి కరుణ దృష్టిని జెందు స్వభావము గలది. ఉపరిచరుడు స్వేచ్ఛనుగోరి ప్రశాంతజీవితము నాకాంక్షించెను. ఉత్తముడుగా బ్రతుక నెంచెను. ఇది కష్ట మైయుండెను. పరిస్థితులే స్వయంగా నీతిని బోధించు చున్నట్లుండెను.

ప్రసాద్ యిట్టి పరిస్థితులచే మానసికబాధతో కుమిలి పోయెను. ఉపరిచరుడు తన పర్యా వలోకనములతో మానవత్వమును ప్రేమించి ఉద్యోగమునకు స్వస్తి జెప్పిముఖకవళికలగూర్చి ఎన్నియో అభిప్రాయములను కలసికట్టుగా నెమరువేసు కొనెను.

సికతని, వర్షము కురిసినపుడు గగనముపైపు పక్షులను మరియు ధరణిపై జంతువు లను తిలకించుచుండెడిది. ఈ సందర్భముననే ప్రేమలేని ప్రాణులపై విచారము జెందెడిది. ఉపరిచరుని అభిప్రాయముల దలచుచు తనను అదుపులో పెట్టుకొను అవకాశముల నెంచుకొ నుచు సికతని కాలము గడపెను.

ఆవేశము, ఆలోచన భిన్నమై ఏక మనిపించును. సోమరితనపు వడకనుండి అనేకా కాశముల చులకని ప్రయోజనము నుండి స్వయంరక్షణ జేసుకొనుట యత్యవసరమై యున్నది

వజ్రములవలె ఉద్యోగులు జనులలో గొప్ప దనమును అలంకరించినను అది స్థితి యొక్క పరిణతి యనబడును. సువర్ణము కళగాపోతపోయ బడును. అన్యాయపు ఉద్యోగులు వఖిలీ వాటి స్థితిని బట్టి పరిణతిని తెల్పుచున్నవి. మధిర విద్యార్థులు ఉపరిచరున్ని త్యాగియని కీర్తించిరి

రేణువులు లతలచే చుట్టబడుటకు కదలిక ముఖ్యమై దూర దూరము నడవబడుచున్నవి. ఆధారములున్నచో వాని పట్టుదల అధికమైనటుల, అన్నిటి మన్నవకు లతలు పెంపుజెందుట ఆగని పని.

సికతని వంటగొందకు వెళ్ళెను. అపూరు సికతనిని చూచిఏదో నెమరు వేసుకొను చున్నట్లుగా తోచినట్లుండెను. పృథివిఅదిరి పోయినట్లయ్యెను. భూతలమంత దేనినో తనలో నిముడ్చుకొని తిరిగి సుధా విధిగా యున్నట్లు సికతని అనుభవించసాగెను.

ఏది ఎట్లున్నను వారి మనసులు సౌకర్యములతో గూడియున్న కష్టసాధ్యమైన నీతి విషయములచే నిండియుండినవి. అప్పుడప్పుడు జ్ఞప్తికివచ్చు విషయములై ప్రతి విషయము సుకుమారమై ముద్రవేయబడు నట్లుండెను. బ్రతుకు స్వేచ్ఛకూడ ఆదర్శమును తెలుపు సంకుచిత పరిస్థితుల స్పందించుటకు నెలవై యున్నది. కొన్ని అవకాశములు ఆదర్శ వంతమైన పథమును ప్రతిబింబింప జేయు నవకాశము కల్పించుచుండెడివి. ఇదియె ఉపరిచరుని ఆలోచనయై యుండెను.

సికతని, వుపరిచరులకు వేపపువ్వుల సువాసన ప్రీతిగొల్పెడిది. వారిలో గ్రామీణ జీవనము ప్రారంభమయ్యెను. నృత్యములు వినోద కార్య క్రమములు జానపదులచే ప్రదర్శింపబడునవి. ప్రాణులగు జంతువులపై ముద్రవైచుకొనినవి. సంగీతము,సర్కసు అన్నిప్రాణుల నిర్వహణాధికారము సంపాదించుటకు మూలమైనవి. దయ మనస్సును జయించును. జానపదుల అభ్యంతరములు తీరలేకుండెను. దేశభక్తులు స్వయం బ్రతుకులను రక్షించుమూర్తులు

"రాచకీయము వేపవలె చేదైన తియ్యనిది. దేశభక్తుల జీవితము అపలమువంటిదే." అని వుపరిచరుడనెడివాడు.

ఆరోజు రాఖీ పౌర్ణమి. మధిర విద్యార్థిని ఒకతె వుపరిచరునికి రాఖి బంధనమును కట్టెను. అపుడు అతను సౌభ్రాతృత్వమును చాటిన మంచి మనిషివలె ప్రకాశించెను.

## 24

మానవజాతి శాంతి భద్రతల పరిరక్షణము కొరకు ఆరోజు మిణుకు మిణుకు మను

తారల వెలుగుల గుసగుస లాడి భవిష్యత్తు గొప్పదనమును తెలుపు సంతోషమును వెలిబుచ్చినవి. సామాన్య మానవులేమి కాంక్షింతురో తెలియరానిదదే.

కిరణ్ క్రొత్త సాధనలను సంఘములో సాధించుటకు పూనుకొనెను. విధానములన్ని సంఘమున వెలిగింపబడినవి. సహకార పధమునను కూలి పనిని గుర్తించు నవశ్యకత యేర్పడినది.

మానవ కష్టము ప్రకృతి సొగసును జయించలేదు. రమేష్ ఈ విచారమునే వెలిబుచ్చెను. భృత్యులు తమ శక్తిని ప్రకృతి వెలుగునకు ప్రదర్శించిరి. పేర్పిరణలు సేవకు నిదర్శనముగా మానవ అవసరములపై ముద్ర వైచుకొనినవి.

యంత్రములచే వ్యవసాయాభివృద్ధి జరుగుట సురేష్ తెలుసుకొనెను. గ్రామీణులలో పెరిగిన సభ్యతను తలంచి సంతోషించుచుండెను. కిరణ్ ఒక ట్రాక్టరు కొని వ్యవసాయము చేయించుచుండెను.

సురేష్ విజయపురికి వచ్చినప్పుడు శైలజ, సింగిణిలను చూచుట తటస్థించెను. శైలజకు స్వయం ప్రకృతిగ కొన్ని శక్తులు నుండెను. సురేష్, శైలజతో మాట్లాడుట సంభవించెను. శైలజతో మాట్లాడు నవకాశము కలిగినపుడు సురేష్‌నకు లత దృష్టికి వచ్చుట సంభవించెను, మధ్యాహ్నభోజనానంతరము ఎంతాడినను అతను స్వేచ్ఛగా నుండు నవకాశము చిక్కెను. అవకాశమతనిని వీక్షించినట్లుండెను.

కిరణ్, సురేష్‌నుగూర్చి సంతసించెను. ఎప్పుడు అవకాశములు చిక్కునను గతుల నన్నిటిని తలంచుకొని ఉపాయముల నాలోచించుచుండెను. వినయ గౌరవముల పరిశీలించ గలుగు చుండెను. గొప్ప దనమును కాదనగల నిజాయితీ స్థితిలో అతను మెలగుచుండెను. సింగిణితో కిరణ్ మాటాడినపుడు జాలికనబడలేదు. "మన సంప్రదాయము ప్రకారము దాంపత్యమున కవి గీటురాయి" అని సురేష్ అనెను. శైలజయునవ్వి అతనితో మాటల ధోరణిలో పడిపోయెడిది.

"ఎవరి మీదనో గాఢంగా మనస్సుంది.. కనుకనే యిలా పరాకుగా మాటాడుచున్నాడు." శైలజ నవ్వుచు అనెడిది.

ఆ పరీక్షల లాంటి మాటలతో కిరణ్ గెలిచినట్లుండెను. సురేష్ బెదిరినట్లు వాదలి పోయెను.

సురేష్ మనస్సు లత మీదనే లగ్నమై యుండెను. ఎవరును విందు వినోదపు సమావేశము గురించి తలచరైరి. జీవితమున గడచు దినములన్నియు అసహ్యముగను బ్రతుకు భారపు వస్తువువలె వుండి పోయెను. ఇట్టి అవశ్యకతను తిరస్కరించ లేకుండెను.

కిరణ్ జీవితము గురించి అభిమానము జెంది యుండెను. అదిదానినే తలంచగలిగిన దేమో అతను మాత్రము ఒక వాస్తవికతను తనలో స్థిరీకరింప జేసుకొనెను. సురేశ్, కిరణ్‌ను తలచి జాలిచెందెడివాడు. కేవలం ఏ సమస్యయే మరపురానిదై యున్నటుల కిరణ్ యెప్పుడును సింగిణిని చూచు నెపమున శ్రీశైలమునకు వెళ్ళి వచ్చుటయు జరుగుచుండెను.

అయిదు రోజులకు శైలజ సింగిణి వెళ్ళిపోయిరి.

సికతని, విజయపురికి వచ్చెను. ఆవిడలో యెంతో మార్పు వచ్చెను. బ్రతుకులో హుందా తనము పెరిగెను. తొలినాటి కాయ కష్టము దూరమయ్యెను.

సురేష్, సికతనిని గారాబముగా మందలించెను. రమేశ్ ఎందుకో విచారమును వెలిబుచ్చెను. సరిత కూడ మాటాడి ఆటాడునట్లుగానే యుండి పోయింది.

ఏదో నెపముమీద కిరణ్ తిరిగి శ్రీశైలమునకు వెళ్ళెను. సింగిణి ఎప్పుడును విషయాసక్తి కలదై యుండెడిది. తనను పరులేమనుకొను చున్నారోయను ఆరాటము కిరణ్‌నకు కలిగెడిదిగాదు. "ఒకడు తొడగోసు కొనిన నేను మెడ గోసుకొందు నేమి?! అని ఆనంద్ అనెడి వాక్యము కిరణ్‌ను మైమరపించెడిది. కష్టములు చిట్టి పోయినట్లుగా చెదరి పోయిన స్థితులపైపు లతలన్నియు వాటిని పెనవేసుకొను స్థితిసురేష్‌నకు భవిష్యత్తునకు మార్గదర్శమయి నట్లుండెను. సురేష్ గురించి కిరణ్‌నకు తెలిసిరాలేదు. సంఘము ఈ యాజమాన్యమును భరించుభావన అతనిని కదిపి వేసినది. కాని ఆనంద్ బ్రతుకు అతనిని పిలిచినట్లు అనుభూతి జెందెడివాడు.

సురేష్‌నకు కష్టమైపోయిన సమస్యల కనుగుణముగా సికతని పేసారక అతని వైపు జూచి నవ్వుచు కుశల సంభాషణ చేయుచుండెడిది. ఎవరు నవ్వినను కిరణ్, ఆనంద్ గురించి తలపోసి బాధపడెడివాడు.

ఏది ఎట్లున్నను సికతని తన భవిష్యత్తు మార్గమునసే బాధల ననుభవించుటకో సుఖ మనుభవించుటకో నడచుటకు సిద్ధపడి యుండుటను కిరన్, సురేష్‌లు గమనించిరి.

అది మాఘమాసము. శ్రీశైలముననే సింగిణీ, కిరన్‌ల వివాహము జరిపించుటకు వర్షిణి నిశ్చయించుకొని విజయపురికి వచ్చెను. పరమేశ్వరుడు సముద్రమథనమున గరళము మ్రింగినందుకు భక్తకోటి జాగరణము చేసినట్లుగా ప్రకృతి యంతయు వెల వెల బోయి నూత్నాశయానందము జెందినట్లుగా తిర్గి వికసించినట్లుగా పొదజూపెను. భూపేష్, కిరన్, సింగిణుల మనస్సుల తృప్తి బరచు నవకాశము కల్గి సంతసించెను.

తొలిసారిగా శ్రీశైలదర్శనము జేసుకొన్న బంధువుల కెంతో కన్నులపర్వమై నట్లుండెను. కిరణ్ యొక్క వివాహము ఆడంబరముగానే జరిగిపోయినది. తెలంగాణ ఉద్యమమున

కొన్ని వందలమంది చనిపోయిరి. అందువలన కిరన్‌నకు ఆనంద్ పైతీరని అభిమానము పొడచూపెను.

మధ్యలో సురేష్ మరియొక తడవ అన్ని విషయముల గురించి తనలోతానే వ్యక్తజెం చెను. పూర్వపు వర్షన్నట్ల భయము అతనెప్పుడును మరచిపోలేదు. అప్పుడతను భయపడ తుండెను.

ఒక నమ్మికపరుకు పుకారును చిన్నసత్యము ఒప్పుకొనగలదు, కానిలోతైన రాజకీయ పరిపాలనా వాదమున ఏమాత్రము ఆశను తృప్తిపరచు బలముండదు.

ప్రతిపత్తి, తీర్మానము, సభా, న్యాయసమాలోచనలనునవి రక్షణయొక్క అంగములు ఎవరే భావము జెందినను సూత్రములను పాటించవలయును. ఎందుకనగా మనము మనచట్ట మును, శాసనమును సామూహికముగా నుతుకుకొనవలసిన అగత్యమున్నది. అది మనిషికి వస్త్రమువంటిది.

సంఘావకాశములు, కోరికలు స్వేచ్ఛదశలకన్న గొప్పవి. సంఘ సంస్థ ప్రతినిధి యగు న్యాయస్థానము: ఇది మానవుని స్వేచ్ఛను గని దానిని తృప్తి జెంద చేయగలదు. అట్టి సామూహికపుటాలోచనలనుండి రక్షించ గలదు.

కాలము వెర్రితలలు వేసెను. చచ్చినవాడు చనటమై, బ్రతికినవాడు బలవంతుడైనటు లతోచెను కాని ఎందుకో సురేష్‌కు అది విరుద్ధమని నిర్ధారణ జరిగినట్లు ఆలోచన పొడ చూపెను.

సింగిణితో శైలజ తిరిగి విజయపురికి వచ్చెను. ఇంతలో ప్రభుత్వ రంగమున మార్పు రావొడంగెను.

విజయపురి ప్రక్కన పోవుచున వాగును శైలజ చూచి ఎంతో సంతసించెను. నీరు పల్లమునకు పారుటలో వినూత్నత గనిపించెను జలదేవత సూక్ష్మరూపమున చేయావనియు గొప్పరూపమున చేయుననియు నవగతమగు నట్లుండెను. అంజనేయుని వలె ఆకారమును పెంచి బలపరాక్రమములను ప్రదర్శించినట్లుపొడమెను. అవిడ చేపల కదలికలను తిలకించెడిది. శైలజ యొక్క భావములు చేపలలోని మొప్పలగాలి పెంపొందు చుండెడివి. భావశక్తి ఉత్సాహములోని నీతిని గ్రహించి నటుల మొప్పలు భావనా గములవలె తోచెను. అవిడ ప్రకృతి దృశ్యములను గాంచుచుండెడిది. తన్మయత్వమున ఆనందము జెందుచుండెడిది.

చిన్నపిల్లలు గాలిపటముల నెగురవేయుటనుగని కదలిపోవుచుండెడిది. కాగితము ఊహా వస్తువుగ తనవ్యక్తీకరణము కోల్పోయినస్థితిలో యిష్టమును తెలుపలేని వగ్నదశలో బంధిం చబడినట్లుగ్గా యున్నగతిని చింతతో తలంచెడిది. అది చెరప బడుట అవిడ కయిష్టమై పోయె

దిది, గాలిపటమునకు గంధారము గాలిలో దృష్టిని సారింప జేయుట స్వేచ్ఛా వకాశమువలె పాండిత్య మనస్తత్వ ప్రోద్బలము వలెనే పొడచూపెను.

ఆమె, ఆనంద్ పై కూడ జాలిజెందెను.

గురుముఖమైన ధృవీకరణ దాని యవశ్యకత యొక్క ప్రణాళికనే కలిగి యున్నది. అలంకరింపబడిన గాలిపటముల జూచి మెచ్చుకొనెడిది శైలజ.

శ్రీ వెంకటేశ్వర స్వామిని దర్శించ వలయునని ఆనంద్‌నకు కుతూహల మధిక మయ్యెను. కిరణ్ తిరుపతికివెళ్ళుచున్నాడని తెలియగానే అతనివెంట ఆనంద్ పయనమయ్యెను.

పుష్కరణిలో స్నానమాడి వారు స్వామిని దర్శించి ఆనందించిరి. అన్నమాచార్యుని విగ్రహమునుజూచి వారుతన్మయులైరి. ఆ కాగ్రేసుని మూర్తి వారికేదో బోధించినట్టి అనభూతి జెందిరి.

శాంతినిలయ మగు ఆలయగోపురమును గాంచి ఔన్నత్య భావాలతో మంచిని నిర్మించాలని వారు అనుకొన్నట్లు ఒకరి నొకరు చూచుకొని తన్మయులైరి.

# 25

రూప ప్రకృతి విర్ణయమునకు లోబడి ప్రేమను చిగురింప జేయగలిగినది. తవపథము తానే దలచుకొన్నది. సోమరి కానిదై కుశల బుద్ధిచే మంచి వడవడితో బ్రతుకు నమ్రత పై యాజమాన్యము సాగించినది. జానపదుల ప్రకృతి నిర్ణయ పరిశీలనతో ఆవిడకెంతో సుహృద్భావము కలిగెను. పట్టణములలోని వాతావరణము ఆవిడలో మార్పుతెచ్చెను. ఆలోచనల క్రమము నేర్చెను. సంగీతము నెరిగుచు హార్మోనియము మరియు పియానో గురించి తెలుసుకొన మొదలిడెను.

విక్రమ్ సరదాగా కాలము గడుపుచుండెను. విచ్చలవిడిగా రూప, విక్రమ్‌లు ఏకాంతముగా తిరుగుచు ప్రేమ క్రీడలు సలుపుట సంభవించెను. చరణదాసు మనస్సు స్థిమిత పడకుండెను.

"మమ్ములను వందరములో ముంపకుమా. మనము స్వేచ్ఛగా తేలనిమ్ము! ఆనంద ఉదధిన హాయిగా మంటివని సంతసించుచుంటివా?" రూపఅనెను. విక్రమ్ ఆనందమునకు మేర లేకుండెను.

సోమకుడు త్వరగా రూప గదిజేరి కొన్ని చిత్రములకు కొయ్య చట్రముల గట్టించుకొని పనికొట్టునుండి తిరిగి వచ్చెను.

" అమ్మా! నేను చిత్రములను చత్రముల గట్టించి తెచ్చి నానమ్మా!" సోమకుడు పిలిచెను.

రూప శ్రద్ధ వహించక యుండెను. అతడు మామూలుగా ఆవిడ ముందుంచి వెడలువల వాటుగలవాడు. చరణదాసు భోజనపు వేళకై ఇంట్లోకి వచ్చెను.

" ఎందుకు సోమకుడు పశువువలె ప్రవర్తించును? " రేఖ అనెను.

చరణదాసు ఆవిడ వైపు జూచినవ్వెను. " పశువులు సేవ చేయుటకు తగియున్నవి. మనుజులు పనిచేయుటకు తగియున్నారు. అందుకే అటులచేయగలిగెనేమో! "

" ఏమియులేదు. అతను చిత్రములను చత్రముల గట్టించుటకు తీసుకొని వెళ్ళెను. వనియా, సేవ చులకనగా వుండునని తలచుచు వాని వెంట రంగుల పెట్టెను. అధ్యాపకుని వలె గొనిపోయినాడు, " రూప చెప్ప మొదలిడెను,

" అసలు నీవు యిచ్చితివా? లేదా?"

"ప్రతి విషయము జెప్పుచు చాల సమయమును గడుపును. అది మామూలు విషయము" రేఖ అన్నది.

" మనమతని ఊహను శ్వాసించవలయును. అదే మంచిది." చరణదాసు నుడివెను.

అందరు అతని వైపు ఆశ్చర్యముగా చూచిరి.

తృప్తి వారికి న్యాయమై యుండెను.

విక్రమ్ యెప్పుడు అవకాశము చిక్కితేనపుడే యాత్రలకు వెళ్ళినను కలకత్తా, ఢిల్లీ, బొంబాయి,మద్రాసు పట్టణముల సందర్శించెను. అతను వ్యాపార దృష్ట్యా లండన్‌నకు ప్రయాణమై వెడలెను వాస్తవికమైన వస్తురూపము పదార్థపు విలువను తనకు తిరిగి చెప్పగలుగు చుండెను.

విక్రమ్‌నకు ఒక సోదరి యుండెను. ఆమె యొక్క ఆత్మహత్య వలన అందరికి యెంతో విషాదము గలిగెను. ఆమె పేరు కళావతి. ఆమె ఇంటరు ప్రథమ సంవత్సరములో నుండ ఆమెను ఒక మెకానికల్ సూపర్‌వైజర్‌నకు యిచ్చి పెండ్లి చేసిరి. కాజీపేట డీజెల్ లోకోషెడ్‌లో అతనికి ఉద్యోగము లభించెను. అతని పేరు రామదాసు.

రెండు సంవత్సరములలో వారికి ఒక బాబు జన్మించెను. అతనిని వారు "ప్రేమ్‌దాస్" అని గారాబముగ పిలుచుచుండిరి. వారు కాజీపేటలోనే స్థిరపడిరి. రేల్వేక్వార్టర్లలో నివసించు చుండిరి.

కళావతి రూపవతి. అందము ఉట్టిపడుచుండెను. అచట పనిచేయు సిబ్బంది, కొంత మంది ఆవిడ కనబడగానే కపటముగా కుమారుని పిలిచినట్లు "ప్రేమ్" "ప్రేమ్" అని పిలిచెడి వారు. సంవత్సరము గడిచిన పిదప రెండు మూడు తడవల పిల్లవానికి ఉత్తరములు వ్రాసి యిచ్చి పంపించడము పెట్టిరి. కళావతి భయపడినట్లు రామదాసు దుండగులచే బాధింప బడెను.

ఒకనాటి ఉదయమువనే గోల్కొండ ఎక్స్‌ప్రెస్ క్రింద పడి మరణించినది కళావతి. అమాయకుడు రామదాసు పుత్రుని ఒడిలో పెట్టి ఎంతో ఏడ్చెను. జరిగినదానికివగచెను.

"ఎంతో సుఖముగా కామవాంఛలు తీర్చుకొనుటకు స్త్రీని ఆహ్వానించు పురుషజాతి వేడ్కను జూడలేను. నా అందపు అమాయకత్వమును భర్తను హింసించు నీచత్వమును గని ఆత్మ హత్యకు సిద్ధపడ్డాను" ఇట్లు కళావతి అని చీటిని గూడ ఆవిడ వ్రాసి చనిపోయింది

లండన్ నుండి తిరిగి వచ్చిన వెంటనే విక్రమ్ ఈ విషాద సంఘటన గురించి తెలిసి విచారించెను.

రూప విషాదవదనముతో విక్రమ్‌ను పరామర్శించి ఓదార్చెను.

"వ్యభిచారము వృత్తిగా బ్రతికించునదే ఐనా, అమలిన హృదయములను కాంక్షించే అజ్ఞాన తిమిరము యేమూలనా పవిత్రతను చోటీయదు. పవిత్రమునకు విలువ నీడలేని సమయమున అది సంఘమును దూషించినటులనే కళావతి చరిత్ర చెప్పుచున్నది." అని రూప అనెను.

విక్రమ్ గాఢమైన దాంపత్యము పిలిచినట్లనిపించెను.

# 26

గౌతమ్ విశ్రాంతి సమయములలో భువనేశ్వరములోని బ్రతుకు హాయిని తెలుసుకొనెను. అతని భవిష్యత్తు ఆశయములను ఊహించెను. వాస్తవమునకు కొన్ని విషయములను ఇతర స్థలములలో నెగ్గించుకొనవలసి యుండెను. దినదినము స్మిత ప్రకృతి వలవరుచుకొను చుండెను.

"నేను నీ ప్రవర్తనలను బలపరచుచు సలహా యివ్వలేని స్థితిలో వున్నాను." అన్నాడు గౌతముడు.

"లేదు. మీ అదృష్టము కొరకు నన్ను మరచిపో అన్నయ్యా!" అన్నది లత.

అకస్మాత్తుగా వారిముందు సురేశ్ కన్పించెను. వారతనిని చూచుటకు ఉత్సాహముగా నుండిరి.

లత వెంటనే సంచిని విప్పి సేపులను, మామిడి పళ్ళను, పుచ్చకాయలను తీసుకొని కొన్ని అరటిపండ్లను వారిముందుంచెను.

"నేను ఉపరితలం గట్టిగా గలవానినే కోరెదను. వాటి ప్రత్యేకతో బాదాములపలుకులే ప్రీతి. ద్రాక్ష పండ్లు జీవితముల నయనములు"

"మృదువైనను ఎండినవైనను నేను సంయుక్త ఫలమునే కాంక్షించెదను, మరియు ఖర్జూరములు, వెలగపండ్లు నాకు చాల ప్రియము."

ఏది ఎట్లున్నను లత తన భవిష్యత్తు కొరకు బాధను జెందసాగెను. ఎన్నో తడవల సురేశ్ యిట్టి ప్రకృతి విషయములను పరస్పర అవగాహనల బద్ధమైనవిగా తలంచుచుండెను. ఇష్టమున్నచోట దారి యున్నది కదా! అతను భవిష్యత్తును స్వీకరించలేదు.

కుటుంబ వృద్ధిచే యాజమాన్యములు సిద్ధాంతముల రీత్యా బాధింపబడినవి. చరణదాను మాత్రము స్వభావోచిత జన్యమగు మానవ యాజమాన్యమునే తలంచుచుండెను. పవిత్రత రీతితో లత, సురేశ్‌ను వీక్షించెను.

"పిట్టలను బట్టువేటగాండ్రు కసాయి వాండ్రును యిద్దరును ఒకే ఆలోచన గలిగి బాధలను జీవిత సమస్యలను మనకు బోధించుచున్నటుల అంతరించి పోయే బ్రతుకుల కేమి గత్యంతరము?' అనెను సురేశ్ ధైర్యముగా.

"వైద్యులు కసాయి వారివలెను, పక్షులు జంతువులును బ్రతుకు భవిష్యత్తులలో పోర్చ్ఛలము జెందు విషయములు నాకగుపడుచున్నవి.' సురేశ్‌తో లత అనెను.

"త్వరిత గతిని దరిజేయుటకు ఈ అలవాట్ల ఆకళింపులకు రగిలించుచు గొప్పదనపు అతిశయోక్తిని మాత్రము తెలుపగలవు.' గౌతమ్ అనెను.

పరిచయ భాగ్యము మృదువైన గుండెలను కోయుటలో, ఎండిపోయిన కఠినమైన వాటిని పగులగొట్టుట యందు కష్టములు, కృషియును త్వరితగతి స్వలాభమువలె నమ్మించు పథముల రూపొందించు చున్నవి.

గౌతముని ప్రియమైన మచ్చికయను ఆలోచనము యేమనగా లతకు సురేశ్‌తో జరుగవలసిన వివాహము ఆకలియికలో అత్యున్నత స్థానము నలంకరించినటుల జరిగిన పరిస్థితియే.

"ఇప్పుడు లత బ్రతుకు కళకు ఎరయై పోవలసినదే.' అన్నాడు గౌతముడు.

"బ్రతుకు సమస్య గురించి తలపకుము. దానిని వదలివేయుము. నేను ఎగతాళి చేయు భావమును కాంక్షించుట లేదు.' సురేశ్ అనెను.

"కాదు అట్లుకాదు నేను కేవలము భవిష్యత్తును గురించియే తలంచుచున్నాను." గౌతముడు అనెను.

లత వారివైపు జూచి ఆశ్చర్యపోయినది.

వివాహము నిశ్చయింపబడినది. అది అంతయును రహస్యమై యుండెను. సురేశ్ విజ పురికి వెళ్ళిపోయెను.

గోధ ఎన్నడును దగ్గటి సంభాషణలతో సురేశ్‌ను మందలించి యుండలేదు. అటువంటి ప్రియమైన అహ్వానమును పురస్కరించుకొని సురేశ్ మనసును నిబ్బర పరచుకొను నవకాశ ము జెందకుండెను.

సురేశ్ కేవలము గోధతో తన వివాహము గురించి మాత్రము తెలియబరచెను. గోధ సంతృప్తి జెందెను.

"అది యంతయు మన స్వంత చేతుల మీదుగా నడిపింప వలసిన అగత్యము గలదు." గోధ కిరణ్‌తో అనెను. ''నీవు తప్పక అతనిని సంతృప్తి బరచవలయును. కిరణ్!''

కిరణ్ తల్లి ఆజ్ఞను ఒప్పుకొనెను.

ప్రకృతి మరి యొక తడవ పునర్జన్మ నెత్తి వటుల నంతయు పచ్చగ అందమయమై పోయెను. ప్రాణము వారసత్వపు అజ్ఞాత పుట్టుకవలె అదృశ్యముగా గాలి సంగీతముచే ప్రవాహముల పాటలతో మెదలు శిఖరముల తావు తన్మయబరచెను.

ఉగాది పచ్చడి సమైక్యతగా చేదు, తీపి, పులుపుల సమ్మేళనము జెంది యుండెను.

కిరణ్ ఆ వివాహ మహోత్సవమును జరిపించుట యందు యాజమాన్యమును నిర్వ ర్తించుటకు సిద్ధమయ్యెను.

ఏకోన్ముఖమైన అభిప్రాయములు ఇంటి పనుల గురించి సురేశ్‌ను వాస్తవిక దృక్పథ మున నిలుపగలిగెను. వినయముగా లత అతని మెప్పుబడసెను

జీవితాంత విషయములు సమస్యలు గౌతముని ఆలోచనలై సురేశ్ ఎల్లకాలము తలంచునవిగా యుండి పోయినవి. అతను వాటితో ఆటంక పరుపబడెను.

సురేశ్ వెనుక జీవితమును భవిష్యత్తు జీవితమును తెలుసుకొనెను. అందు నూతన పథము నెరిగినట్లను భవించెను. అతను అటువంటి సమ్మేళనములను తలంచియుండలేదు.

స్థిరమైన బిగువు జీవితమే అతనిని బ్రతుకనిచ్చెను. అతను కిరణ్‌తో సన్నిహిత సంబంధముల బ్రతుకును చూర గొనెను. స్వయముగా విజయాత్మక సంతృప్తికర అభిప్రాయముల తనిని అంటి పెట్టుకొనియు మేలుకాంక్షించుచుండెను. సురేశ్ దయాశీలి. ఎప్పుడును ఆతను ఎవనిని చిక్కులిగా బాధించి ఎరుగడు. మామూలుగా బ్రతికిన పేరు అతనికి దక్కినది.

సింగిణికి ప్రొద్దులు నిండినవని శ్రీశైలము నుండి వార్త వచ్చెను. అయినను గోద, మరియు కిరణ్, సురేశ్ వివాహపు పని పాట్ల నేమాత్రము చులకన చేయక సాగించుటకు కృతనిశ్చయులై యుండిరి.

# 27

ఉగాది పర్వదినమునకు ఆనంద్ స్వగ్రామమునకు వెళ్ళినప్పుడు కిరణ్ మనస్సులో భ్రాంతియ భేదభావ భయాందోళనలకు గురికాని సౌభ్రాతృత్వము తొణికిపోయెను. కనులలో నీరు తిరిగెను.

అదే దినము వెంకటపురమునకు తల్లి బతుకమ్మ, మేనమామ సీనయ్య వచ్చారు. సీనయ్యకు ఒకతే కూతురు రత్తమ్మ. సీనయ్య భార్య ఎప్పుడో గతించిపోయింది. కనుక అక్క చేతిలో రత్తమ్మను వుంచి పోవాలని ఆరాటపడ్డాడు. సీనయ్య.

'' నీవు యిక్కడే వుండిపో మామా! నేనంటే ఎలాగో బ్రతుకుచున్నాను. '' అన్నాడు ఆనంద్ సీనయ్య ఒప్పుకొన్నాడు.

భోగిరెడ్డి చనిపోయి రెండు సంవత్సరములయింది. కొడుకు అంకిరెడ్డి సీనయ్యను చేర దీయాలని అనుకొన్నాడు. కలసి మెలసి చదువు కొన్న ఆనంద్‌ను జూచి చాల జాలిచెందినాడు మనిషికి పరిస్థితులు తోడై మనోప్రవృత్తిని మార్పించుట జరుగుచునే యుండును.

గ్రామోద్యోగి భిక్షపతి బతుకమ్మకు అడపా దడపా పది ఐదు రూపాయలిచ్చి చివరకు బాకి క్రిందికి గామ వారికున్న అరఎకరం పొలం తన పేర వ్రాయించుకొన్నాడు. అప్పటికి ఆనంద్ పదిహేనేండ్ల వాడు.

'' ఆనంద్ పెద్దవాడై ఎలాగో ఆదుకుంటాడు లేవమ్మా .... ఈ చెడ్డరోజులు ఎలాగో గడచిపోనీవమ్మా '' అని భిక్షపతి, బతుకమ్మను సముదాయించిన రోజులు బతుకమ్మకు జ్ఞప్తికి వచ్చి ఎంతో దుఃఖించిన రోజులు లేకపోలేదు,

బతుకమ్మకు ఆనంద్‌ను చూడగానే ఎంతో సంతోషము కలిగినా లోని విచారము మాత్రము పోయినట్టులేకుండెను.

మొదటి నుండియు బొంబాయి నుండి వచ్చి స్థిరపడిన ప్రదీప్ అను హిందుస్థానీయుడు వీధి బడిని నడుపుచుండెను. అతని కొడుకు బాలాజీ అనువాడు. అంకిరెడ్డి బాలాజీని చూచి యెరగడు. తన తండ్రి గతించిన పిదప న వత్సరములోనే భార్య అనిల చనిపోయింది. తల్లి రమణమ్మ దుఃఖించి మరో వివాహం చేయాలని తలపోసినది కాని పరిస్థితులు కలిసి రాలేదు అంకిరెడ్డి హైద్రాబాదులోనే వుంటు గుత్తా పనులలో ధనమంతా వెచ్చించడము మొదలుపెట్టెను అనిల కొన్ని దినములు వెంకటపురంలో వున్న రోజులలో అంకిరెడ్డి హాయిగా కాలము వెళ్ళబుచ్చెను. మర్యాదగా చిలుపూరుకు అనిలను తోలుకొనిపోయిరి. కలరానోకి అనిల మరణించెను చిలుపూరులో పేరు మోసిన తిరుమలరెడ్డికి అనిల ఏకైక పుత్రిక. సస్యలక్ష్మి పుణ్యముల పండించుచున్నదో యన చిలుపూరు పలురకముల తోటలతో భాసిల్లుచుండెను.

అనిల చావు వార్త అందరికీ అయోమయంగా వుండిపోయినది. హైద్రాబాదు నుండి తిరిగి వచ్చిన అంకిరెడ్డి విచారములో మునిగిపోయెను. లోలోన అతను నమ్మలేకుండెను.

నెల రోజుల లోపల ఎవరికీ తెలియకుండ అంకిరెడ్డి చిలుపూరు చేరుకొనెను. ఊరి బయట ఒక ఆసామి అంకిరెడ్డినిగని " ఈ దొరగారి భార్యే మొన్న జరిగిపోయింది. " అని అనిన మాటల తను విని నివ్వెర పోయెను. కలరా భయంచే ఊరి బయట వున్న తిరుమలరెడ్డి అల్లున్ని గని దుఃఖించి మందలించి భోజనానంతరము స్వగ్రామమునకు పంపించెను. అంకిరెడ్డికిదియంత విచిత్రముగా వుండిపోయినది, ఆనెల పిదప తిరిగి హైద్రాబాదునకతను వెళ్ళిపోవుట తటస్థించెను.

ఉగాదికి అంకిరెడ్డి స్వగ్రామము రావడము జరిగింది. బాలాజీ తండ్రి ప్రదీప్ తల్లి యూన్ని పాడుపడిన రమణమ్మ బంగ్లాలో రెండు గదులు అద్దెకు తీసుకొని ధీమాగా వుండిరి. బాలాజీ పోలీసు సబ్ ఇన్స్పెక్టర్ ఉద్యోగములో వున్నవాడు. ఉగాది ముందుగా పది రోజుల క్రితము తల్లిదండ్రుల జూచిపోదామని పక్షం రోజుల సెలవు మీద బాలాజీ అచటికి వచ్చియుండెను.

పూర్వపు వియోగముతో బాధపడిన అంకిరెడ్డి మనసు చెదరిపోయింది. రమణమ్మ మీద కోపమధికమైపోయింది. తన భార్య చనిపోయిన సంగతి మనసులో ధృవపడకుండెను. కలరా విచిత్రపుఘటన బూటకమనిపించెను. అనిల ఎందు నిమిత్తమో తనను జేరలేదని అనుకొన్నాడు.

బంగ్లాలో వున్న బాలాజీ, అతని భార్య పద్మలను మొదటి దినము జూచి అమాయకుని వలె వుండి పోయాడు. పద్మలో అచ్చము అనిల పోలికలుండడము వల్ల, రమణమ్మ దుఃఖము లెక్కకించనివాడై వారంతా మూర్ఖులని తలచుకొని, మూడవ రోజు బాలాజీ స్వయంగా గదిలో వుండగా తాళం వేశాడు, అంకిరెడ్డి అందరిని కసిరి కొట్టాడు.

సాయంత్రము వరకు బాలాజీ వెంట వచ్చిన ఒక పోలీసు కానిస్టేబుల్ జిల్లా పోలీసు

అధికారితో సహావచ్చాడు. అంకిరెడ్డిని పోలీసులు బలవంతముగా పట్టుకొని బాలాజీని విడిపించిరి చిలుపూరు వెంకవ్న అంకిరెడ్డిని మందలించినట్లయ్యెను. "ఎందుకు బంధించి నావయ్యా!" అన్నాడు అధికారి.

"ఎవరో దుర్మార్గులు అని బంధించాము." అన్నాడు అంకిరెడ్డి.

ఏమి పరిచయము లేనివాడు అంకిరెడ్డి. అధికారి అతనిని ఒకపూట రిమాండులో వుంచి బిక్షపతి, అనంద్ ల జామీను తీసుకొని విడిపించాడు. వెంకవ్న మహిమ ఎంత విచిత్రము!

యదార్థము నెరిగిన అంకిరెడ్డి పశ్చాత్తప్తుడయ్యెను.

"అనిలా! అనిలా!" అని అంకిరెడ్డి వాపోయెను. రమణమ్మ అతనిని సంభాళించలేక పోయెను.

ఆనంద్ ను జూచిన అంకిరెడ్డి వెక్కి వెక్కి ఏడ్చెను. గ్రామ ప్రజలంతా ఆశ్చర్యపోయిరి "తిండి బస నియమము లేని వానికి భార్యను తీసుకొని పోవు సమయము చిక్కని వాని దీనావస్థ అది." అని పలువురు అతని మీద జాలిగనబరచిరి.

బురదలోని మొక్క వలె భోగిరెడ్డి బ్రతికినా, సువాసన విచ్చు కుసుమము వలె అంకిరెడ్డి జన్మించినాడు. పాపమునే పీల్చుకొని బ్రతికినాడు భోగిరెడ్డి. రమణమ్మ అంకిరెడ్డి అమాయకత్వమునకు సుగతి ప్రాప్తి కావలయునని వాంఛించెను. ప్రదీప్తుగాంచి అంకిరెడ్డి శిష్యత్వముచే కుమిలెను.

సీనయ్య అంకిరెడ్డి అండచేరి బ్రతుకు సీదసాగెను.

ఆనంద్ నకు గూడ వారి అండ జేరవలయునని ఆలోచన తట్టెను. కాని అంకిరెడ్డి ఆ విషయమును ప్రస్తావించక పోవడము తెలుసుకొన లేక పోయెను. దీనికి కారణము బిక్షపతి అను విషయము తమపరి యెరిగెను. తన అధికారమును కొనసాగించుటకు బిక్షపతి పన్నిన వలలో అంకిరెడ్డిని వేసుకొనగలిగెను. రజాకార్ల దోపిడికి గురై తెములుకొనని ప్రజాపీకము సంఘ విద్రోహుల శక్తికి తాళకొనలేదు. కార్మిక సక్తు నేల గూలిన చెట్టు వలె అయిపోయింది.

బాలాజీ పరిస్థితులు తెలుసుకొనిన వాడై ఎంతయో ఆశ్చర్యము జెందెను. భయపడు కపోతము వలె రెడ్డి సౌధమున, ఆనంద్ మెదిలెను. బతుకమ్మను, రత్నమ్మను వెంటనిడుకొని ఆనంద్ విజయపురికి ప్రయాణమయ్యెను. సీనయ్య ఆనందమునకు మేరలేకుండెను. జంటకపోతముల వలె వారు వెళ్ళిపోయిరి.

"నెల రోజుల పిదప తప్పక వచ్చి చూచి పోతానామ్మా! అక్కకు చేత కాదు. మంచిగా ఆరచుకోవమ్మా!" అని రత్నమ్మను మందలించాడు సీనయ్య. అతనికేదో జ్ఞప్తికి వచ్చింది.

రత్తమ్మ అపుకోలేని దుఃఖముతో వెడలిపోయింది.

పాపం! సీనయ్య మనస్సంతా కుమిలిపోయింది. పెరెడులోని గడ్డిబొమ్మపై సీనయ్య పాత చొక్కాను రత్తమ్మ వేసింది. ఆనంద్ సర్దెను.

కొందరు బంధువులు అంకిరెడ్డికి పిల్లనిచ్చుటకు వచ్చి వెనుకంజ వేయుట రవణమ్మకు బాధగా యుండెను.

అంకిరెడ్డి చిలుపూరి వెలవెలబోయి ఆతన్ని పరామర్శించుచున్నట్లు అనుభూతి జెందుచు విచారించుచుండెను.

# 28

ఆనంద్ స్వకుటుంబుడై వచ్చినందులకు కిరణ్ ఎంతయో ఆనందించెను. తదితరులు వారి ఇంటను తెలుసుకొని మెచ్చుకొనిరి. అక్కడి ప్రకృతి బతుకమ్మను, రత్తమ్మను మైమరపించెను.

"కాస్తో, కూస్తో కూడ బెట్టుకొని ఇంతభూమి కొనుక్కో నాయనా!" అంది బతుకమ్మ.

ఇంతవరకు ఆనంద్ సంపాదించిన డబ్బుతో సీనయ్యకు, బతుకమ్మకు, రత్తమ్మకు బట్టలు తెచ్చాడు. అరతులము బంగారముతో మాత్రము ఒక నీలము వజ్రముగల ఉంగరము చేయించెను. ఇదియంతయు కుమార్ ప్రోద్బలము మీదనే జరిగినది.

ఆనంద్ కొరకు వేయించిన పాకను మరమ్మతు చేయించి పెంకుటిల్లుగా సవరించాడు కిరణ్. దానిలో వారు హాయిగా ఉండడము మొదలుపెట్టారు.

విజయపురిలో సురేశ్ వివాహపు సందడి మిక్కుటమై స్టేషనునకు రోజు ఎడ్ల బండి పోవలసి వచ్చెను. ఆనంద్ ఈ పనితో సతమతమవుచుండెను.

ఆ రోజు కిరణ్‌ను ఎడ్ల బండిలో స్టేషన్‌కు తోలి ఇంటి ముఖం పట్టాడు ఆనంద్. పెనుగాలి వీచింది. చెట్లు విరగడం మొదలు పెట్టినవి. నిర్మానుష్య ప్రదేశంలో బండిని అపుకొని ప్రమాదముల నుండి తప్పించుకొన్నాడు కిరణ్. సురేశ్ వివాహపు హడావిడిలో భాగ్య నగరం వెళ్ళెను.

పెద్ద చెట్టు విరిగి ఆనంద్ పెంకుటిల్లుపై పడడము వలన ఎనగర్ర విరిగిపడిపోయింది ఏమీ ప్రమాదము సంభవించలేదు. "స్థిరపడని జీవితాన్ని ఎవరేమి ఆశించినా, పరం

ఉపయోగపడి, చెట్టువలెనో గుట్టవలెనో బ్రతికిననే గదా ఆనందంగలదు!" అనుకొన్నాడు ఆనంద్. బతుకమ్మ, రత్తమ్మ విచారించిరి.

నెల పదిహేను రోజులకు సీనయ్య, విజయపురికి వచ్చెను. అతను పరిస్థితులు మారి పోయినందుకు విచారమును వ్యక్తము జేసెను. దేని బాధ అధికమై మరింత క్రుంగిపోయెను.

రత్తమ్మ వివాహము జరిపించవలయునని అతను ఉబలాటము పడుచుండెను. తన కళ్ళముందుగా వివాహము జరిపించి తీరవలయునని సీనయ్య బాగా వ్యథజెందుచుండెను.

ఆ వైశాఖ మాసములో ఏ విధముగా నైన చిలుకూరు శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో ఆనంద్, రత్తమ్మల వివాహము చేయవలయునని అతనికి ఉబలాటముగా ఉండెను. అంకిరెడ్డి హైద్రాబాదులోనే వున్నా సీనయ్య పని బాగా వచ్చినట్లయి పోయింది. అతని అనుజ్ఞ మీదనే విజయపురికి వచ్చెను. ఆనంద్, రత్తమ్మల వివాహము గురించివిని సంతోషించిన అంకిరెడ్డి అది జరుపబడ వలయునని ఆశించెను.

మూడు దినముల పిదప సీనయ్య, బతుకమ్మ, రత్తమ్మలతో కలసి వేంకటపురము పోదలచెను. ఆంధ్రోద్యమము ముమ్మరముగా సాగుచుండెను. ఆనంద్‌నకు మనసులో మనసు లేకుండెను. కిరణ్ మనసు చివుక్కుమనెను. ఏమైన అన్యాయము జరుగునే మోయని అతనికి భయముగా నుండెను. అప్పటికే తిరుపతి శ్రీనివాసుని దర్శించుటకు వచ్చు తెలంగాణ భక్తులను కొందరు దుండగులు ఆంధ్ర ప్రాంతమున హింసించుచుండిరని వదంతి మొదలై ను. ఆ రోజు ఏమి అలజడిలేదని సీనయ్య ప్రయాణమయ్యెను.

ఆ సాయంత్రము వరకు సీనయ్య వారిద్దరితో సహా నాగార్జునసాగర ప్రాంతముచేరెను. అంతకు ముందుగా రెండు బస్సులు కొద్ది దూరములోనే తెలంగాణము వైపు పోవునవి దగ్ధమై పోయినవి. వారందరు ప్రాణము లరచేతులలో పెట్టుకొని నిరీక్షించుచుండిరి. వార్తలను విని కిరణ్, ఆనంద్‌లు బెంగతో కుమిలిపోయిరి.

"తిరిగి విజయపురికి వెళ్ళిపోయెదమా!" అన్నాడు సీనయ్య.

రత్తమ్మ, బతుకమ్మ ఏమి మాటాడలేకపోయిరి.

"చూస్తు చూస్తు ఈ ప్రాణాలను అగ్ని దేవునికి బలియివ్వడం సబబు గాదు. వన్నె వచ్చైనా మూర్ఖడనక మానరు." అనుకొనెను సీనయ్య. మనలను జూచి తిరుపతి శ్రీనివాసుడు మా వెంకన్న వలె నవ్వుచున్నట్లు అద్దములో ప్రతి బింబము వలె తోచెను.

రాత్రి పది గంటల వరకు వారు విజయపురి చేరిరి. తెల్లవార్లు వారి వద్ద కుమార్, జ్యోతి ముచ్చట్లు పెట్టుకొనుచు వుండిపోయిరి. మరునాడు కిరణ్ స్వయముగా కుమార్‌ను యిచ్చి సీనయ్యను, బతుకమ్మ రత్తమ్మలను పంపించెను.

ఆనంద్ రెండు కన్నీటి చుక్కలను రాల్చెను. కుమార్ గూడ దుఃఖమునాపు కొన లేక పోయెను. ఆనాడు రాత్రి వరకువారు విజయవాడ చేరిరి. రైలు మార్గము ద్వారా ప్రయాణము ప్రమాద రహితముగా నుండెను. వారందరు విజయవాడలో కాజీపేటకు పోవు రైలు బండి ఎక్కిరి.

మరునాడు ఉదయమువారు కాజీపేట చేరిరి.

తెలుగు దేశపు పైరు పచ్చలను కుమార్ తిలకించి ప్రకృతి శోభను గాంచి ఆనంద్ తోలనూగినట్లనుభవించెను. అది వరకే విని యున్న శ్రీ మెట్టు రామప్ప సీతాలాములో శివ పార్వతులోయననొప్పు శిఖరములగని మధ్యాహ్నము వారు వెంకటపురం చేరుకొనిరి అక్కడి నుండి కన్పించు చిలుపూరు శ్రీ వెంకన్న గుట్టను ఎంతో భక్తి ఆవేశముతో తిలకించిరి. సాక్షాత్ శ్రీ వెంకటేశ్వరస్వామి ఆకారము వలెనే ఆగుట్ట కన్పించుచున్నట్లుండెను. వెంకట పురంలో వారిని క్షేమముగా దిగవిడిచి కుమార్ మరునాడు విజయపురికి వెళ్ళిపోయెను.

కుమార్‌నకు తిరిగి భాగ్యనగరము పోవలసిన అగత్యము కలిగెను. వివాహమును పురస్కరించుకొని సురేశ్ చరణదాసు వద్దకు ఆహ్వాన పత్రికను పంపతలపెట్టెను. నెల రోజుల సెలవు విజ్ఞాపన పత్రమును దాని వెంట పంపించనెంచెను. కాని స్వయముగా కుమార్‌ను వెంటనిడుకొని వెళ్ళెను.

ఆ రోజు విజయపురిలో వార్తా చలన చిత్రముల ప్రదర్శన జరిగినది. గ్రామములలో వైద్య సౌకర్యము దాని విశిష్టత గురించిన చిత్రముల ప్రదర్శించిరి. కూలీల ఎంతో సంతోషించిరి. పరిశుభ్రత గురించిన సమాచారము వారికి తెలిసి వచ్చెను. ఇతర రంగములలో గ్రామీణులు ఆరితేరిన ఘటనలను స్మృతికి తెచ్చునటుల చూపబడిన చలన చిత్రము ఎంతో మందిని ఆకర్షించినది. కిరణ్ యిట్టి ప్రదర్శనము కొరకు ఆఫీసులో పాటుపడెను. వ్యవసాయపు పనులకు వెళ్ళు పిల్లలు, పాఠశాలలకు వెళ్ళు పిల్లలు చూచి ఆనందించిరి. వారిలో నవోత్సుకత వెల్లువికినట్లయ్యెను. మానవుని కృషి తమలోను క్షీణించి యున్న దశను స్మృతికి తెచ్చినట్లుండెను.

ఆ సంవత్సరము వరకు గ్రామీణ ఋణము పెరిగి పోయినది అధికోత్పత్తిలో ఎంతో ముందంజవేసినది. అయినను రమేశ్ ప్రజలను పెడమార్గము బట్టించి అనేకములైన ప్రోద్బలములను అణచివేయుటకు ఎంతో ప్రయత్నము చేయసాగెను. కడలిలాంటి సంస్కృతి నుండి కమ్మనికళాసాహితి మేఘముకురిసినట్లు పరిస్థితికతకై కిరణ్ కరుణలో కన్నీరునించెను. కుటుంబ నియంత్రణ సమస్యగా యుండి యుండెను. పలు ప్రాంతములలో సర్పంచులు శస్త్రచికిత్స చేయించుకొను వారిని పురికొల్పి ఎంతో డబ్బు కాజేసిరి. గాని రమేశ్ అట్లు చేయలేదు. ప్రజా సౌకర్యము కొరకు ఎంతయో పాటుపడెను. ఇతని ఉదారత్వముచే కిరణ్ యొక్క పలుకుబడి

కొంత తగ్గిపోయినది. ఉప్పు నీటి మంచి నీటి ప్రాంతీయతత్త్వములను భాషా మేఘమువలె తలపించినట్లుండెను. సికతని ప్రసూతికి విజయపురి వచ్చెను. రమేశ్ గృహమంతయు బంధు మర్యాదలతోను కళకళలాడుచుండెను.

రెండు రోజుల పిదప సికతని ప్రసవించెను. మగ శిశువు పుట్టెను. గ్రామములో జనత ఆనందించెను. రమేశ్ ఉపరిచరునకు శుభవార్త పంపించెను.

కిరణ్ పెండ్లి హడావిడిలో మునిగి యుండెను

సురేశ్ వివాహానంతరము ఆయిదవ రోజు సికతని శిశువు నామకరణోత్సవము జరుగు నని అందరు నిశ్చయించుకొనిరి.

అన్ని మర్యాదలతో గౌతమ్, లత సురేశ్‌ల వివాహము జరుప ప్రయత్నించు చుండెను.

# 29

చరణదాసు ఆకర్షణీయమైన ప్రగతిని కుటుంబమునగాంచ తలపెట్టెను. అతను జీవితము భవిష్యత్తును తలపెట్టుకొను సాధనమని నమ్ముచుండెను. దిన దిన మతడు ఆనందాయకమగు జీవితమును అలవాటు చేసుకొనుచుండెను.

ఆది వరకే ఇరవై రోజులైనది. వారందరును భాగ్యనగరము నుండి నీలగిరులకు వెళ్ళి ఇంకను తిరిగిరాలేదు. చరణదాసు విచారకమైన మరియు తప్పుడు క్రోధల భావనల మరచిపోయెను. వెను వెంటనే అతను క్షేమముగనే యుండెను.అది అతనికి అదృష్టపు ఘడియ యైనది. అతనక్కడ ఆనందముగా నుండెను.

సురేశ్ మాత్రము నీతిదాయకమగు ఆకర్షణను అతని మీద ప్రయోగించెను. అది స్పందింపుచు భరింపరానిదయ్యెను. స్వయం జనితమగు శక్తియే వారి పవిత్రాత్మల దరి జేరు చున్నట్లుండెను. వారిద్దరు ఒకరై పరస్పరము బరువు బాధల నెంచగలిగిరి.

జీవితపు సమస్యను అదుపులో యుంచుకొనగలిగి దూప ఎప్పటికిని స్వేచ్ఛగా బ్రతుగి సాగించెను. తన నడవడినితానే సంభాళించుకొనుచుండెను. విద్యుచ్ఛక్తిని పరిశీలించినచో రాగి మరియు తైలముల ప్రక్రియలు బోధపడును. జల విద్యుచ్ఛక్తిలో కొంత గొప్పదనము కల్పించును. అటులనే మానవతలో నింబంధనాత్మకమగు ప్రక్రియలు బోధపడగలవు. దాని అవశ్యకతల రూపము వలెనని పరిణతి జెందుట తప్పని సరియై యున్నది. లాభములతోయు విద్యుచ్ఛక్తివలె ఆరోగ్యము మహాభాగ్యమై పరోపకారి యగును.

మనో బలము లేని పని చేయుట కష్టము. చరణదాసు ఆర్థికపరమైన సాహస కృత్యము రాణించెను. భారతదేశమున అంతర్జాతీయ వాణిజ్య ప్రదర్శనముపై యాజమాన్యము వహించు నవకాశ మతను పొందెను.

కఠినత్వమున్నట్టి శిలలో మృదువైన గుణమును పొందుటకు తగిన కారణములు మూలమగును. శిల్పము లోనిగర్వము మరియు కరుణ అనునవి పదార్థము నందు కన్పించే బాహ్యాంతరములగు స్థితులు. రూపము మరియు విధానముచే మార్పు జెందునట్టి మానవత్వమున మహాత్మ నెన్నుకొనుట వాస్తవము

ఆ స్థితి తన యొక్క స్వయం కాలమును కలిగియున్నది.

రూప తనకు తానే యింటి పనికి తగిన బొమ్మ వలె అందముతో కళ కళలాడుచుండెను వస్తువులలోని అందము అవి వుండు కాలము మనుజుల వాడుకను బట్టి సృష్టి పరిణామమును గ్రహించ గల అల్పబుద్ధి దేవుని తలపింపజేయుచున్నది.

శాస్త్రీయ విధానములలో వచ్చిన మార్పుల గమనించినచో చరణదాసునకేదో వింత వలె గాఢ యడి తపము వలె తోచుచున్నట్లుండెను. దృఢమైన కరంటు మోటారులను తయారు చేయగల చరణదాసు సంస్థ చైతు బంధువై కీర్తి కెక్కెను.

మూల కర్బనపు పొడవగు కడ్డీ ఋణ-ధన స్థానముల నాలుగైదు రాగి తీగల కలుప బడిన అన్ని రంధ్రములు గల పలకపై ఒక ప్రత్యేక మగుతీగెను కలుపబడిన పదార్థముల కడ్డీ రాగి తీగతో చుట్టబడిన పిదప బ్యాటరీ సెల్లు నందు పరమాత్మ మన్నించిన శక్తి రేడియోలో గననగును. దానిలో మార్పిడి శబ్దమును మనము వినినట్లు, విస్తృంతిత్రి శ్రవణ యంత్రముల గనినట్లు సృష్టిలో దైవ స్వరూపమును పోల్చుకొను ప్రభావ ముల పరిశీంచు వీలు గలదు. ఋషుల శక్తి విలువకు మనిషి కృషి తపమునకు భేదములేదు.

గ్రామ ఫోను కూడ ఒక నిర్మాణాత్మకమగు సృజింప బడినదగు పరికరము. దానిలో గాలి పీడనము, రికార్డు సంగీతమును తిరిగి వినిపింపజేయును. పరిధి రేఖలు కొలత ప్రమాణ ములతో శబ్ద జన్య ప్రక్రియను సాధించుట కనువైనవి. లక్క కావలసిన వస్తువు. చన బ్రతుకు త్రోవ లెన్నియైనను పలు వేషములైనను వెలుగుచుట్టును గ్రహ పథములలో తిరుగాడుచున్నట్లు సృష్టి యందు దేవుని ఆట సంగీతా మృతమను పంచుచున్నట్లు ఫోటో గ్రఫికి సంబంధించిన విషయ కొలతలు పేపర్ గణిత సిద్ధాంతములోని వని జీవులకు పరమాత్మకు గల దూరము మోక్షమని అరవింద మహాశయుని రహస్య వాదము గొప్పదని చరణదాసు మనసార ఆచరించుటకు కంకణము కట్టుకొనెను. " చరణదాసు పరిషత్తు " అను దానిని చరణదాసు నూతనముగా ఏర్పాటు కావించెను.

సురేశ్ మరియు కుమార్ భాగ్యనగరం జేరిరి.

చరణదాసుతో స్వయముగా సురేశ్ మాట్లాడినపుడు రూప కూడ అదే గదిలోవుండెను. వారిద్దరు ఒకరి నొకరు చూచుకొనిరి. సురేశ్ యేమీ అనలేదు.

రూప, కుమార్ వైపు సంజ్ఞ చేసి, "బాబూ ఇటురా" అని పిలిచెను.

కుమార్ రూప యొక్క గదిలోనికి వెళ్ళెను. అతను రూప చేతి చిత్రము జూచి ఏదో ఆలోచనలో మునిగి పోయినట్లుండెను. మాంద్యులే తాటి చెట్ల వంటి మనుజులని ఆనంద్ పై జాలి జెంది అనుకొనెను.

"సురేశ్‌నకు ఈ చిత్ర పటమును యిమ్ము. అతనికి వివాహ మహోత్సవపు బహూమానముగా వంప చేయబడినదని వివరింపుము" రూప కొయ్య చట్రము కట్టబడిన ఊహాత్మకమగు వర్ణ చిత్రపటము నిచ్చెను. చరణదాసు దానిని గాంచి ఆశ్చర్యపోయెను. సురేశ్ పెండ్లిలో దానిని ఎంతో కీర్తించిరి.

ఆదృశ్యము విక్రమ్ చేత గీయబడెను.

తేలికైన ఒక బాట వాళ్ళయమై యుండెను. భిన్నభిన్నముగ బాలు బాటలో యున్నవి. ఒక గుడిసె, గందు. ఒక వ్యక్తి వంట చెఱకు మోపుతో పోవుచున్నటుల, ఒక స్త్రీ సద్ది యన్నమును నెత్తిపైన తెచ్చుచున్నట్లుగా చిత్రింపబడెను. కొన్ని వేపచెట్లు, మామిడి గున్నలు, మోదుగు చెట్లు చింత చెట్లుగలవు చెఱకు తోట ప్రక్క మామిడి చెట్లపై కోకిల యుండెను తాటిచెట్లు కొన్ని కన్పించుచుండెను.

అత్యున్నతమైన తాటిచెట్లు తీయదనమును త్రాగు యత్నపు ద్వంద్వరూప భావముల నా దృశ్యము ప్రదర్శించుచుండెను.

శిశిరము చివరిసారిగా తనభిక్షను ఉత్సుకతతో పొందు పరచుకొని నిద్రపోయినట్లుండెను. సకలమునైనను త్యజించునట్టి దృఢనిశ్చయముతో ప్రకృతి మైమరచి యుండి నూతన వికాస ప్రయత్నమున కాటామచుండెను. వసంతము నవ్య కాంతులచే విరాజిల్లుచుండెను. ప్రకృతి సభావేదికపై గాన కచేరిని కొనసాగించుటకు ఆ యత్తమగునట్లు వదితయూరగుచుండెను. సురేశ్ తిరిగి వచ్చిన వెంటనే రూప విక్రమ్‌ల వివాహము చరణదాసు నిశ్చయించి నందుకు మెచ్చెను. వైభవముగా వారం రోజులలో పెళ్ళి జరిగి పోయింది.

# 30

రవణమ్మ, అంకిరెడ్డి వివాహము జరిపించవలయునని యెంతో ప్రయత్నము చేయుచుండెను. కొన్ని దినముల పిదప అంకిరెడ్డి వెంకటపురము వచ్చెను. అది ఆశ్వయుజ మాసం.

ఆ రోజు సీనయ్య చిలుపూరునకు ప్రయాణమై పోవుటకు సిద్ధముగా వుండెను. ఆ వారము రోజుల క్రితము నుండియే అతని ఆరోగ్యము బాగా దెబ్బతిని యుండెను. కార్తీకమున వరి చేలు కోయించి కుప్పలు బంతులు కట్టించి బాగా అలసిపోయి వుండెను. మనోవ్యధతో నీ పనులన్ని చేయించెను.

రత్తమ్మ అనారోగ్యత తెలిసి ఆనంద్ వచ్చెను. వేసంగి పది ఎకరముల మక్క వేసిరి. మధ్యన పెద్ద తృణపూలిని చేసి పెట్టిరి. వారము రోజుల క్రితము దాదాపు బండెడు కంకి దొంగిలింపబడెను. అది అంత సీనయ్య చేయించినాడని వదంతి మొదలయ్యెను. వేసంగి వరి కోతలు కోయించి కుప్పల వేయించెను.

మరునాడు తృణపూలిని జూచి సీనయ్య నివ్వెర పోయినాడు. దానిపై తన ఒంటి మీద పంచె బంధింపబడి యుండెను తెల్లవారగనే అంకిరెడ్డి పేరడు దర్శించినపుడు తృణపూలిపై చిరిగి పోయిన పంచెను గాంచెను.

అక్కడవున్న కావలి వాండ్రను అంకిరెడ్డి అడిగెను "గోపయ్యా! ఈ పంచె మొదటి నుండి ఈ తృణపూలిపై యున్నదా?"

"అయ్యా! ఆ పంచె సీనయ్యగారిది. నిన్న మాత్రం లేకుండెను! మామూలుగా వుండే పాత పంచె కాదది."

"అయితే సీనయ్య నిన్న వడ్ల కళ్ళము వద్దనే కావలి కాయుచుండెగదా!"

"ఏమో! దొర!"

అంకిరెడ్డి మనస్సు పరి పరి విధముల త్రొక్కులాడెను. ఆనంద్ వివాహమునకు ఏదో యింత సహాయము చేయుటకు అతను సిద్ధముగా నుండెను. కాని దుర్బుద్ధిచే సీనయ్యయిలాంటి పని చేయించెనేమోనని అతను అనుమానము జెందెను.

వెంటనే సీనయ్యను అక్కడకు పిలిపించిరి. సీనయ్య గాభరాగా అక్కడికి పరుగెత్తు కొని వచ్చెను.

అంకిరెడ్డి వెంబడి భిక్షపతి వుండెను.

"అయ్యా! దొరగారూ! అదుగో చూడండి.... సీనయ్య చొక్కాకు వెనక పేడమరకలు మనము పెరడు విరపించిన రాశి మీది పేడ అంటి వుంటుంది." అన్నాడు భిక్షపతి.

అంకిరెడ్డి నివ్వెర పోయి ఆ పేడ మరకలను సావధానముగా పరిశీలించెను.

అంకిరెడ్డి భిక్షపతి సదాసరి వడ్ల కళ్ళము దగ్గరకు వెళ్ళిరి. అక్కడి కావలి వాండ్రను అంకిరెడ్డి పిలిచి పలుకరించెను.

"మల్లేసూ! .. రాత్రి సీనయ్య యిక్కడ వుండెనా? లేక ఎప్పుడైనా ఎక్కడైనా వెళ్ళెనా?"

"అయ్యా! తెల్లవారు ఝామున రెండు గంటలకు యిక్కడి నుండి వెళ్ళిపోయినాడు."

"ఇదంతా విచిత్రముగా నుందేమయ్యా! భిక్షపతి" అన్నాడు అంకిరెడ్డి.

భిక్షపతి దీర్ఘాలోచనలలో పడిపోయిన వాని వలె వుండి పోయెను.

వారిద్దరు తిరిగి యింటి ముఖం పట్టిరి.

"అయ్యా! కంకి అంతా కాజీపేటకు పోవు బండి బాట ప్రక్క బొందలో వున్నది. మీద అంతా చెత్త వున్నది." అని ఒక ఎలవాడు మధ్యాహ్నము వరకు వార్త తెచ్చెను. ఆ ఎలవాడు తహశీలు కచేరికి ఏదో పని మీద పోబోవుచుండగా దారి మధ్యన ఈ కంకి నంతా గాంచెను.

అంకిరెడ్డి ఆపేద మరకల గురించి, సీనయ్య పాత పంచె గురించిన వివరము లతని వడిగెను. అతనికే మీపాలు పోలేదు. ఆనంద వచ్చి వెళ్ళినప్పటి నుండి అతనికి రంది యెక్కువయ్యెను.

"రాత్రి బతుకమ్మ జ్వరముతో బాధపడుచుండగా వెళ్ళిన సంగతి మాత్రము నిజము. నాదగ్గర వున్న పంచె తృణపూలిపై వుంచబడుటయు నాకు విచిత్రముగానే తోచుచున్నది. దొర వారికొక విన్నపము. నేను రాత్రి యింటికి పోవునపుడు మాత్రము పంచె నాకు దొరకక నేనే బాధపడ్డాను," అన్నాడు సీనయ్య.

అంకిరెడ్డి అరాత్రి గోపయ్యను ఏకాంతముగా కొన్ని ప్రశ్నలడిగెను. గోపయ్య యిట్లు సమాధానము జెప్పెను. "రాత్రి ఒంటి గంట ప్రాంతములో నాకు గాఢ నిద్ర బట్టింది. రెండు గంటల మేరకు ఏదో చప్పుడయినట్లనిపించి అటు ఇటు చూచు చుండగా చేనులో ఎవరో యిద్దరు చిన్న చెడ్డీలు తొడుక్కొని చేతిలో కర్రలతో తిరుగుచుండగా బెదిరిపోయాను. నాకీ కంకి రాశి యథా తథా కనబడుచున్నట్లుండెను. వారా: వారు త్రాగి పారవేసిన ఏదో సిగరెట్టు ముక్క రాశి వద్ద బడివుంది."

సీనయ్య నిద్రలో వుండగా చొక్కాకు పేడ అంటించి ఆ దొంగలు పాతది తీసిఒంటి మీద పంచెను. తృణపూలి మీద చుట్టి పెరదు చేసుకొనిరి. అది దొంగల కనువైనట్టుగా సరియైన రక్షణ లేనందున పదే పదే దొంగతనములు జరుగసాగినవి.

సీనయ్య తనలో తానే కుమిలిపోయి ఆనాటి రాత్రి జ్వరముచే పీడింపబడెను. రత్తమ్మ మనసులో మనసు లేకుండెను. ఒక ఆయుర్వేద వైద్యుడు వచ్చి కొంత కషాయము త్రాగించెను. బతుకమ్మ ఎంతో విచారించ మొదలిడెను.

" జలుబు చేసినదమ్మా! " అన్నాడు వైద్యుడు.

అంకిరెడ్డికి సీనయ్యపై గల అనుమానము తొలగిపోయినది. అయినను భిక్షపతి ఏదో విధముగా నేరము సీనయ్య మీద రుద్ద యత్నించినను అది విఫలమై పోవుటచే అతనేమి చేయలేకపోయెను.

కావలివాండ్రకు సీనయ్యపై గల అభిమానము దెబ్బ తినలేదు. ఇదంతయు బాట దోపిడి గాండ్ర పనియని ఊరంతయు వార్త తిరిగి పొక్కిపోయెను.

అంకిరెడ్డి స్వయముగా వచ్చి సీనయ్యను మందలించెను. " విచారించకు సీనయ్యా .. దొంగల పని అట్లాగే వుంటుంది. నువ్వేమీ అనుకోవద్దు. ఆనంద్ వివాహము తప్పక నీవు జరిపి తీరాలి. నాజన్మకా ఋణం తీరనిదే తిరిగి పెళ్ళి కాదు. నాదు అమ్మ మానుకోట సంబధం కుదిర్చింది. "

సీనయ్య బలహీనంగా ఆనందాశ్రువులతో అంకిరెడ్డిని వీక్షించుచు, " నియడు రత్తమ్మ జ్వరము వలన పెండ్లి ఆగిపోయెగా" అనెను.

బహునాళ్ళకు వెంకటపురంను దర్శించుటకు వచ్చిన సీనయ్య గురువుల వారు, చిలుపూరు గురించియు అతని క్షేమము గురించియు అడిగి మందలించెను.

" ఏమున్నది అయ్యగారూ .. నా భార్య బ్రతుకవలెనని ఆస్తినంతా అమ్మి హీనుడనైతిని. దైవమీ గతి పెట్టినాడు." సీనయ్య అనెను. " మరెప్పుడు వస్తారో మరి ఆశీర్వదించండి, "

గురువుల వారు అక్షంతలు సీనయ్య పంచెలో పెట్టి దీవించెను. సీనయ్య లేదవకవారికి అయిదు రూపాయలు కట్నం యిచ్చెను. రత్తమ్మ, బతుకమ్మలు గురువునకు పాదాభివందనము జేసిరి.

" శుభం " అన్నాడు గురువుల వారు.

మరునాటి నుండి సీనయ్యకు ఆరోగ్యము మరీ చెడిపోయినది. పంచె కొంగునకు అక్షంతలు ముడివేసి కట్టుకొని కూటీలకు ఆ పంచె వేసెను. అది అట్లాగే యుండి పోయెను.

గ్రామములో ప్లేగు, మలేరియా వ్యాధులు మితి మీరి యుండుటచే జనత భయాందోళన జెందసాగెను.

# 31

ఒక శిశువును ప్రసవించనున్న రూప పరిషత్తునకు తిరిగి వచ్చినది. చరణదాసు ఆవిడను పరామర్శించెను.

"నాకు అనుమానము లేదా నాయనా, వారు నన్ను పరిషత్తు చేరవలసినదిగా ఆదేశించిరి."

ఆకాశములో చంద్రుడు ప్రకాశించెను. రూప నొప్పులు పడి రాత్రి వేళ శిశువును కనెను. చరణదాసు బంధువులుగని సంతసించెను. విక్రమ్ శిశువును వారం రోజులలో వచ్చి చూచి పోయెను.

మలయ మారుతము పరిషత్తున గుస గుసలాడెను. ఆ శిశువు మంచములో ఊగసాగెను. చరణదాసు ఆవిడకు ''భద్ర'' అను నామకరణము చేసెను. బారసాల రోజు వైభవముగా విందు జరిగినది.

ఎన్నో తడవల విక్రమ్ పరిషత్తులో చిత్ర లేఖనమును బోధించెను. రూప సంస్కృతమును నేర్చి ఇతరులకు పరిషత్తులో చెప్పెను.

కిరణ్ యొక్క అద్రికయను బిడ్డను, సికతని యొక్క కోవిదుడను తనయున్ని ఆ పరిషత్తునకు పంప బలవంతము చేసెను సురేశ్. వారు ఒప్పుకునిరి. అతడు సంతసించెను.

పరిషత్తు సరియైన స్థితిలో నడచెను. శిశువులు పెద్దవారై చదువను అనుకూలముగా పోషింపబడిరి.

అద్రిక మరియు కోవిదుడు సురేశ్‌ను ఏవగించు కొనెడివారు

భద్ర చురుకుగా ఎప్పుడును చేతిలో పెన్సిలు, కాగితము కలిగి యుండెడిది. అందముగా చిత్రము వేయు నారాటము కన్పట్టు చేయుచుండెడిది. చరణదాసును పరిషత్తులో వుండగా ''టా టా'' అని సంబోధించుచుండెడిది. అతను ఆశ్చర్య పడుచుండెను. అతను మిక్కిలి వృద్ధుడై పోయెను. వింజామరల ముందు కూర్చొని అతను పరిషత్తు అనుజ్ఞలనెర వేర్చుచుండెను.

సోముకుడు తన యవ్వనములో చరణదాసునకు సేవ చేసెను. అతను స్వయం ప్రతిపత్తి వాదనలచే రూపను లెక్క చేయకుండెను. ఆవిడ మెలకువగా అతనికి సంతుష్టిని కలిగించెడిది.

సురేశ్‌నకు సన్నిహితముగా సదవకాశము చిక్కినది. కిరణ్‌ను గౌతమ్ మరియు శైలజ అభిప్రాయముల తీర్పుమని వేడెను. సింగిణితో సంప్రదించుటకు కిరణ్ నియుక్తుడై శైలజా గౌతమ్‌ల వివాహము నిశ్చయించెను. ప్రభాసు మరియు సత్యవతి బలహీనులైరి. వారిపై కిరణ్ ప్రభావము మిక్కిలిగలదు. అతను వివాహమును గొప్పగా జరిపించెను.

"అవినయపు నడకలు గొప్పదనము కెన్నడు దారి తీయవు" శైలజ అనెను.

గౌతమ్ ఈ అభిప్రాయము చేకొట్టబడిన వాడై పరిస్థితికి కట్టుబడెను.

ఒకే మనసు ఆశయములు తెలియని ఆకర్షణలచే అర్థరూపమును వెదకుచున్నవి. శైలజ మరియు గౌతమ్ సమాన ప్రేమికులై జీవిత స్పందన సమభాగులైరి.

చరణదాసు కార్యనిర్వహణ పొగడ్తచే సంతుష్టి జెందెను.

పరిషత్తులో పిల్లలకు మంచి సౌకర్యములు ఏర్పాటు చేయబడి యుండెను.

"సోమకా! సోమకా! తొందరగా అద్రికను, కోవిదులను తీసుకొనిరమ్ము;" భద్ర చెప్పెను.

"వారు భువనేశ్వరమునకు వెళ్ళి పోయిరి." సోమకుడు జవాబిచ్చెను.

భద్ర ఆశ్చర్యపడినది. ఆవిడకీ విషయము తెలియదు. ఏకాంతముగా కూచొని అన్ని పాఠములను పరిషత్తులో నేర్చుకొనెడిది. చదువు కొరకు వ్రాయుటకును ప్రత్యేక తరగతులలో ఉపాధ్యాయులచే పాఠములు బోధింపబడుచుండెను. ఆ ఖర్చంతయు చరణదాసు స్వయముగా భరించుచుండెను. నిరభ్యరంతరముగ వుంది. ఆరోజు కూడ ప్రశాంతముగ నేనిద్రించెను

తుమ్మెదలు ఒక గుండునకు తెట్టెను తయారు చేసినవి. అరటి చెట్లు, చెరకు తోట ప్రక్కన సెలయేరుపై ప్రొద్దు పొడుచుచుండెను. సెలయేటి మత్స్యములు వాతావరణములోని విజ్ఞాపనము నెరిగించునట్లు ఆడుచున్నవి. అందులో పొలమునకు నాగలితో వెళ్ళు రైతు మరియు మేఘము కనబడునట్లుండెను. చెట్లు గాలి బీభత్సమునకు వంగినవి. సెలయేరు రెండు గుట్టల మధ్యన వుండెను. భద్ర చిన్నగా ఈ చిత్రమును గీసెను.

"అద్రికను కోవిదుడిని వెంట నిడుకొని లత రాగలదని" సోమకుడు చెప్పెను. రెండ వదినమే వారు వచ్చిరి.

"నీ పని ఏమై యుండెను?" అద్రిక, భద్ర నడిగెను.

"నేను నిన్నటి దినము ఒక చిత్రమును గీసితిని" భద్ర అనెను.

కోవిదుడు ఈ విషయమును తెలుసుకొనలేక పోయెను.

సోమకుడు ఫోటో చట్రములను ఒక గుడ్డతో శుభ్రము చేయుచుండెను. అందులో కొన్ని కడుగబడినవి. విక్రమ్ వెంటనే అతని పనిని గాంచెను. అతని కాశ్చర్యమయ్యెను.

"సోమకుడా! సోమకుడా! త్వరగా ఫోటోలను చిత్రముల చట్రములను తెమ్ము! వాటిని నీటిలో ముంచకుము!" గౌతమ్ అరచెను.

అది యొక్క చిత్ర లేఖనపు దళసరి కాగితము. విక్రమ్‌నకు భద్ర యిచ్చెను. లేఖనము శుభ్రముగా వుండెను. దానిని జూచి ఆశ్చర్యపడెను. అది మంచి దృశ్యమగు చిత్రలేఖనము.

"పవన సందేశము." భద్ర చెప్పెను.

విక్రమ్ నిజము తెలిసి భద్రను ఆవిడ భావోత్సుకతను మెచ్చుకొని సంతసించెను.

చరణదాసు దానికి కొయ్య చట్రము చేయించి అద్దమున అమర్చుటకు అజ్ఞాపించెను. అతనొక సంగీత కార్యక్రమమును నిర్వర్తించెను. పాటల ప్రవాహములు ఊదబడినవి. ఆ చిత్రపటము కుడ్యముపై ప్రేలాడదీయ బడినది. అతను భద్రను సంతుష్టురాలుగ చేసెను.

భద్ర సోమకుని వైపు జూచెను.

సోమకుడు విక్రమ్ చేత భయపడిన వాడై నిశ్చేష్టుడై నిలబడెను. అతను చిత్రములు గీయయత్నించెను. చులకనైన మెప్పుగల పని తనమే అతని అభ్యాసము. అతనికి రంగుల పెట్టెలు లేకుండెను.

ఒకసారి రూప నుండి ఒక రంగు పెట్టెను తీసుకొని యుండెను. ఏవో ప్రయత్నముతో చిత్రము గీయ యత్నించెను. కాని అతనికది వయసులోని పట్టుదల యొక్క ప్రహసనపై పొడచూపెను. తనలో తానే అతిగ నవ్వు కొనెను. ఆరోజు పిల్లల గురువు కంఠస్థము చేయించిన శ్రీనివాసుని పాటను వర్ణించెను.

-: శ్రీ ని వా సు డు :- [పాట]

ఇలయందు వేంకన్న
వెలసి ఉన్నాడు,
శాంతి ధర్మము జగతి
స్థాపించినాడు.

అపర్భాంధవునిగ
అదుకున్నాడు
వాగుగా భక్తులను
పాలించినాడు.

పద్మావతీదేవి
ప్రకృతి లోపలను
మహాలక్ష్మి వెలసినది
మహనీయురాలు.

దండములు దండములు
తగు శ్రీనివాస
కరుణతో మముజూడు
కారుణ్యతేజ!

పదకొండవ అవతారమూర్తి వలె ప్రశస్తిగాంచిన శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకు మరునాదే సోమకుడు తిరుపతికి వెళ్ళెను.

తిరుపతి సర్వజాతి సమ్మేళనమై కళ కళ లాడుచుండెను. భక్తులు తమ తమ బాధలను మరచి స్వామిని దర్శించుకొనుచు "పాపముల హరించు అపర శివునిబోలు విష్ణుమూర్తి ఈ దివ్య రూపము!" అని పొగడుచు వెడలిరి.

సోమకుడు స్వామిని దర్శించి తరించెను. తిరుపతిని జూస్తు "ఇదే వేదపురి" అని ప్రశంసిస్తు ఇల్లు చేరెను.

# 32

విజయపురి పాఠశాల యుత్సవములో పాల్గొనుటకు రమేశ్ సురేశ్‌లకు అహ్వానము లందినవి. సురేశ్ వెంబడి సోమకుడు వెళ్ళెను. కిరణ్ మరియు యితర గ్రామస్థులు ఆసభలో పాల్గొనిరి. ఆ వార్షికోత్సవము అతి వైభవముగా జరిగెను.

ఆ రాత్రి భూపేశ్ ఒంటరిగా యింటిలో వుండెను. ఆ ప్రాంతంలో పేరు మోసిన సుందరయ్య, మాతయ్య అను యిద్దరు నక్సలైట్లు భూపేశ్ దగ్గరకి వచ్చిరి. ఇంతలో సురేశ్ అక్కడికి వచ్చుట పసిగట్టెను. నక్సలైట్లకేదో ఆకర్షణశక్తి సురేశ్‌లో కన్పించెను. "దున్నేవానిదే భూమి" అని నినాదం చేస్తు వారు పోయిరి.

"నీ యిష్టపూర్తిగా ఐదు వేల రూపాయలిస్తివా సరే. లేనిచో నీ ప్రాణంవుండదు." అని ఆ నక్సలైట్లు భూపేశ్‌ను ఆజ్ఞాపించిరి. అంతకు మునుపే కిరణ్ పని మీద విజయవాడ వెళ్ళెను.

సురేశ్ విస్తుపోయి నిర్మానుష్యంలోనికి చూచెను. రాజకీయ ప్రజాస్వామ్యములోని అడ్డు గోళ్ళను దలచి ఆతను చింతించెను. నియంతృత్వ ధోరణిని ప్రోత్సహించరాదని నిశ్చయించెను.

ఆనంద్ ఆవు దూడను విడిచి ఆవు పాలు పితుకుటకు సిద్ధముగా వుండెను. అదృశ్యమును జూచి విస్తుపోయి ఆనంద్ నిలువున నీరైపోయెను. భూపేశ్ సరేనని అన్నమాటపై నక్సలైట్లు వెళ్ళిపోయిరి. మరునాడు సురేశ్‌ను విజయపురి ప్రజలు పాఠశాల సభలో ప్రభుత్వ విధానములను విమర్శినందుకు అభినందించిరి. "సారా మొదలగు వాటిని నక్సలైట్లు నిర్మూలించమనుట మంచిదే" అని అతననెను. ఆరోజు సురేశ్ వెళ్ళిపోయెను.

ఆ నాటి నుండి ప్రభుత్వ రక్షణ దళముచే ఆ ప్రాంతమునను పరిసరములలోను నక్సలైట్ల ఆచూకీ తీయు ప్రయత్నము జరిగినది. కిరణ్ బ్రతుకు మరోదారి దొరక్క నగరము చేర్చెను.

మరునాడు ఉషా చంద్రతో ఆనంద్‌నకు ఒక కాగితము ఇచ్చి వెళ్ళిపోయెను. ఆనంద్ దానిని ఉద్వేగమున నందుకొని చదువుకొనెను.

వేంకటపురం,
వైశాఖ శు॥ ౫

పూజ్యులగు ఆనంద్ బావగారికి
నీ మరదలు రత్తమ్మ అనేక వందనములు.

వైశాఖ శు ౧౫ నకు మన వివాహము బ్రాహ్మణోత్తములచే నిశ్చయింపబడినది. నాయనగారికి కొంచెము అస్వస్థతగా వున్నది. మీరు వెంటనే బయలుదేరి రావలయును.

ఇట్లు,
మీ మరదలు
రత్తమ్మ

కిరణ్ మొదలగు వారందరు అప్యాయముగా నా విషయము నాలకించి ఆనంద్ నభినందించిరి. తిరిగి సతీ సమేతుడై రావలయునని కిరణ్ అతనిని కోరెను. ఆనంద్ ఒప్పుకొనెను తగిన ఏర్పాట్లు కూడ కిరణ్ చేయ నమకట్టెను. సప్తమి రోజున ఆనంద్‌ను వేంకటపురము నకు ప్రయాణము చేయించెను కిరణ్.

ఆనంద్ వేంకటపురము చేరునరికి సీనయ్య ప్రమాద స్థితిలో వుండెను. బతుకమ్మకు గూడ అస్వస్థతగా వుండెను. రత్తమ్మ ఏడ్చుచు క్షోభ చెందుచుండెను. ఆనంద్ రత్తమ్మ నోదార్చెను.

నాల్గు రోజులకు సీనయ్యకు గుండెపోటు వచ్చెను. అందరి కెటుతోయక బాధ జెందుచుండిరి. అంకిరెడ్డి, వరంగలుకు తీసుకొని పోవ ప్రయత్నము చేయగా, సీనయ్య అక్షతలు కట్టివున్న పంచెతో బయట కొచ్చెను.

"నాయనా! ఆనంద్ జనతకు రెండు కళ్ళు స్వేచ్ఛ మరియు ప్రజాస్వామ్యములే. మీ వివాహము జరిపించాలని అనుకొన్నా విధి కష్టముల బెట్టుచున్నది. రత్తమ్మను నీ చేతిలో పెడుతున్నాను. సమతతో సౌఖ్యం మిమ్ముల ఆదరించుగాక!" అని సీనయ్య ప్రక్కకు పడిపోయెను. వెంటనే గడిసె పరుండ బెట్టి నతడు మరణించెను.

వెల వెల బోయిన తెలుగు కళలు పొదల చాటున విస్తుపోవుచున్నటుల అదంద్ వించెను. ఇంతలో పంచె బయటనే పడివుండెను.

ఎక్కడి నుండో వచ్చిన కాకి ఆ పంచెను తన్నుకొని పోగా, అలజడికి గుడిసె పెరడులో జార విడిచెను. అది పెరటిలోని తృణపూలిపై పడెను. కళ్యాణమును ఆహ్వానించి వట్లుండెను.

సంపూర్ణము.

.... శుభము ....

## ఇ య్యా ది

విశ్వ జనీనంబగు సాంఘిక ప్రయోజనార్థము అవాల వంశోద్భవుడు
కేశవరెడ్డి పౌత్రుడు, ధర్మారెడ్డి పుత్రుడు
కవిరత్నయశో భూషితుండగు సాహిత్య సంపన్న గుణ శేఖర
దామోదరరెడ్డి కవి రచనంబైన
" తృణపూలి "
శ్రీ తిరుమల వేంకటేశ్వరుని కంకితమగు నవల సమాప్తము.

# విశ్వసాహితి - వేయి రేకులు

విశ్వ సాహితి శ్రీ పోతుకూచి సాంబశివరావు గారిచే స్థాపించబడింది. వరంగల్లులో శ్రీ ఆవాల దామోదరరెడ్డిగారు అధ్యక్షుడుగా దాని శాఖ ఏర్పడింది. సాహితీ మిత్రులు, ఉపాధ్యాయులు, ఉద్యోగులు, అధికారులెందరో దీనిలో సభ్యులు. పేద విద్యార్థుల రచనా పాటవాన్ని పరీక్షించి పోతుకూచివారు 1987లో 300 రూ. బహుమతులు పంచిరి. దినపత్రికగా వస్తున్న విశ్వరచన 2 ప్రచురణలు [నెలకు] వరంగల్ విభాగం చేపట్టింది. Unilit ఆంగ్ల పత్రికలో రచనలు వస్తున్నవి. త్వరలో విమలశ్రీ మరియు శ్రీయుతులు యస్. దయాకర్, వేణుగోపాల్ రావు గార్ల ఆంగ్ల సంపుటాలు ప్రచురింపబడనున్నవి.

సాహితీ సంక్రాంతి, (సంకలనం) మరియు కేశవ ప్రస్థావ గీతిని సంస్థ ప్రచురించియున్నది. చిత్ర సార్థకజీవి గ్రంథాల ఆవిష్కరణ జరిపినది. జాతీయ సమైక్యతపై కవి సమ్మేళనము, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, వివేకానందులపై గోష్ఠులు నిర్వహించినది. కథా, కవిత పోటీలు ఏర్పాటుచేసి అధికాదరణమన్నన పొందినది

వరంగల్లు జిల్లా రచయితల మహాసభలను దిగ్విజయముగా 1989 ఏప్రిల్ లో నిర్వహించి అధికారుల ఆదరాభిమానములను గొన్నది. ఇతోధికముగా సహకరించిన సాహితీ ప్రియుల, సభ్యుల సంస్థగా విశ్వసాహితీ వరంగల్ విభాగం పని చేయుచున్నది. జాతీయ భాషాభిమానులు పండితులు కూడ యిందులో భాగంగా డా॥ ఆర్. మాధవరావు గారు కూడ తమవంతు కార్య భారము చేపట్టనున్నారు. విశ్వసాహితీ వేయిరేకులు విప్పాలని ఆశిస్తున్నాము.

విశ్వసాహితి - వరంగల్ విభాగం,